# హరిసంకీర్తనాచార్య అన్నమయ్య

(111 మంది  కవుల పద్యసంకలనం)

**పరిష్కర్త**

## విద్వాన్ చక్రాల లక్ష్మీకాంత రాజారావు

అవధానభారతి, సాహితీచతురానన, ఛందోవైవిధ్య నిష్ణాత, స్వర్ణకంకణ,
కవిగండపెండేరపు సత్కారగ్రహీత

**సంపాదకుడు**

## డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య,

M.A., M.Com., M.Phil., Ph.D.,

ప్రచురణ

## డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య

16-6-81 శ్రీనివాస అగ్రహారం

నేతాజి పైలట్ స్కూల్ ప్రక్కన, నెల్లూరు - 524 001, ఆం.ప్ర.

ఈమెయిల్: tekumalla.venkatappaiah@gmail.com

ఫోను: 9490400858, 91105 80418

# హరిసంకీర్తనాచార్య అన్నమయ్య

(111 మంది కవుల పద్యసంకలనం)

**సంపాదకుడు : డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**

**పరిష్కర్త :** **విద్వాన్ చక్రాల లక్ష్మీ కాంత రాజారావు.**

**ముద్రణ :** ప్రథమ ముద్రణ
ప్లవ - శ్రావణ- ఆగస్ట్ - 2021

**ప్రతులు :** 1000 కాపీలు

**మూల్యం:** రూ. 150/-

**డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య**
3 వ మెయిన్ రోడ్డు
16-6-81 శ్రీనివాస అగ్రహారం
విజయమహల్ దగ్గర
నేతాజి పైలట్ స్కూల్ ప్రక్కన
**నెల్లూరు - 524 001, ఆం.ప్ర.**
**ఈమెయిల్:** tekumalla.venkatappaiah@gmail.com
**ఫోను:** 9490400858, 91105 80418

**డి.టి.పి:** శ్రీగంగాధర్, హైదరాబాద్ - చరవాణి: 9848133848

**ప్రచురణ: డా. టేకుమళ్ళ వెంకటప్పయ్య,** నెల్లూరు.

**ముద్రణ:** శ్రీఅళహరి రాము, విజయవాడ - చరవాణి: 9440277811

# విషయ సూచిక

విషయము పుట



## హరిసంకీర్తనాచార్య – అన్నమయ్య పద్యములు



# TELUGU BOOK OF RECORDS

ISO 9001 2015 Certified Organization
Regd. by Govt of T.S. A.P.



**APPROVAL LETTER**
OF APPRECIATION

Date: 8th August,2021

To,
Dr.Tekumalla Venkatappaiah
Nellore, Andhra Pradesh.

Subject: Your achievement has been recognised by Telugu Book of Records.

Title: FIRST TIME PUBLICATION OF A CLASSICAL TELUGU POETRY BOOK ON ANNAMACHARYA BY 111 POETS

Category : OUR POETS & WRITERS

Certificate Description:

Dr.Tekumalla Venkatappaiah S/o T.Subrahmanyam (born on 25-07-1957) from Nellore, Andhra Pradesh, India has made a Poetry Book in Telugu Language by 111 Poets from both the Telugu States and abroad aswell. This book consists of 444 poems of 111 poets (each poet 4 poems) written on First Telugu Vaggeyakara Annamacharya. This is the first time of publishing a poetry book has been appreciated by the Telugu Book of Records in Our Poets & Writers category.

Yours sincerely

Dr. Chintapatla Venkata Chary
Founder President & Chairman
Contact: 9247841092
Website:www.telugubookofrecords.com
FaceBook@TeluguBookRecords
Twitter@TeluguBookofrecords
Youtube@TeluguBookofRecords
Instagram@TeluguBookofRecords

Stay Safe and Healthy


Stay safe during COVID-19 Coronavirus





www.telugubookofrecords.com







# కృతజ్ఞతాంజలి

మొదటగా అన్నమయ్యతో నా పరిచయానుభవాలు, ఆయనపై నాకుగల అవ్యాజానురాగాల గురించి చెప్పాలనుకుంటున్నాను. నేను నెల్లూరు వెంకటగిరి రాజా గారి హైస్కూల్లో 1968వ సం.లో ఆరవ తరగతి చదువుతున్నప్పుడు, పదేళ్ళ వయసులో పాఠ్యభాగంగా వచ్చిన "తాళ్ళపాక అన్నమాచార్యులు" పాఠం, సుమధురంగా కళ్ళకు కట్టినట్టు బోధించిన శ్రీ పి.ఎం.గోపాలాచారి అయ్యవారిని ఎప్పటికి మరువలేను. అన్నమయ్య తన జీవిత కాలంలో ఇంత సారస్వత సముద్రాన్ని సృష్టించడం నాకు అప్పట్లో చాలా ఆశ్చర్యాన్ని కలిగించింది.

తరువాతి కాలంలో తి.తి.దే వారు రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారు, వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, సాధు సుబ్రహ్మణ్య శాస్త్రి గారు లాంటి ఉద్దండ దిగ్గజాలు రాగిరేకులను పరిష్కరించడం, నేదునూరి కృష్ణమూర్తిగారు, మల్లిక్ గారు, రాళ్ళపల్లివారు, గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్, నల్లాన్‌చక్రవర్తుల బుచ్చయాచార్యుల వంటి వారు వాటిని స్వరపరచడం గరిమెళ్ళ బాలకృష్ణప్రసాద్, శోభారాజ్ వంటివారు అన్నమాచార్య ప్రాజెక్టు ద్వారా ఆ కీర్తనలను వివిధ సభల్లో ఆంధ్రప్రదేశ్ నలుమూలలా అత్యద్భుతంగా పాడడం, అప్పటి ప్రాజెక్టు డైరక్టరు శ్రీ కామిశెట్టి శ్రీనివాసులు వాటిని క్యాసెట్లు రూపొందించి గాయకులకు భక్తులకు అందజేయడం వంటి సంఘటనలకన్నింటికి నేను ప్రత్యక్ష సాక్షిని.

విద్యాభ్యాసం తర్వాత 1978 సం.లో ఉద్యోగ నిమిత్తం విజయవాడలో స్థిరపడ్డ తర్వాత, 1982 సం.లో నా వివాహానంతరం, నా అర్ధాంగి శ్రీమతి చిదంబరి మంచి గాయని కావడం, పలు అన్నమాచార్య కీర్తనలను కచేరీల్లో గానం చేస్తూ ఉండడం వలన మళ్ళీ అన్నమయ్య సాహిత్యంపై నా ఆసక్తి చిగురించింది. తి.తి.దే వారి అన్నమయ్య సాహిత్యాన్ని అన్ని సంపుటాలను తెప్పించుకొని పరిశోధనలో ఉన్న తరుణంలో, శ్రీ తాడేపల్లి పతంజలి, శ్రీ జి.బి.శంకరరావు, శ్రీ వెంకట్ గరికపాటి వంటి వారి పరిచయ, సాహచర్య, ప్రోత్సాహాల మూలంగా కీర్తనల వ్యాఖ్యానాలను, అంతర్జాల పత్రికలైన "మాలిక", సిలికానాంధ్ర వారి "సుజనరంజని" పత్రికల్లో "అన్నమయ్య ఆధ్యాత్మికానంద



లహరి", "అన్నమయ్య శృంగార నీరాజనం" అన్న పేర్లతో పలు సంవత్సరాలు వ్యాఖ్యానాలు వ్రాశాను. అడపాదడపా తి.తి.దే వారి సప్తగిరి పత్రికలో కూడా వ్యాఖ్యానాలు వచ్చాయి. ముఖ్యంగా అన్నమయ్య అష్టవిధ నాయికల శృంగారకీర్తనల మీద వ్రాసిన వ్యాఖ్యానం చాలా బాగుందని, అలంకార శాస్త్రాన్ని వివరించి వ్రాయడం గురించి పలువురు పెద్దలు, పాఠకులు ప్రశంసలజల్లు కురిపించడం నాకు అత్యంత ఆనందాన్నిచ్చింది. సంగీత జగద్గురు త్యాగరాజస్వామికి ఉన్నవిధంగా తొలి తెలుగు వాగ్గేయకారుడైన అన్నమయ్యపై అష్టోత్తర శతనామావళి ఇంతవరకూ రానందున, నేనే ఆ సాహసానికి పూనుకుని వ్రాయడం జరిగింది. ఈ అష్టోత్తర శతనామావళిని ఒక అనుబంధంగా ఈ పుస్తకంచివరలో ఇస్తున్నాను.

ప్రస్తుత పుస్తకం "హరిసంకీర్తనాచార్య అన్నమయ్య" విషయానికి వస్తే, శ్రీనివాసునిపై ముప్పదిరెండు వేల కీర్తనలు వ్రాసిన అన్నమయ్యపై ఉభయ తెలుగు రాష్ట్రాల్లోని పండితులు, కవులు తమ పద్యాల్లో శ్లాఘిస్తే ఒక రికార్డుగా ఉంటుందన్న ఉద్దేశ్యంతో సంకల్పించిన నా తలంపుకు, నేను ఊహించని రీతిలో అపూర్వ స్పందన లభించడం నా అదృష్టంగా భావిస్తున్నాను. 111 మంది కవులకు/కవయిత్రులకు పేరు పేరునా నా కృతజ్ఞతలు. వారి ఆర్థిక, హార్దిక సహాయ సహకారాలతో ఈ గ్రంథం ముద్రణ జరిగింది. వారి సహాయం మరువజాలను.

ఈ పుస్తకం దోష రహితంగా ఉండాలన్న తలంపుతో ఈ గ్రంథంలోని పద్యాలను పరిష్కరించుడని కోరినప్పుడు, ప్రముఖ సంస్కృతాంధ్రాంగ్ల పండితులు, అవధాన భారతి, సాహితీ చతురానన, ఛందోవైవిధ్య నిష్ణాత, స్వర్ణకంకణ, కవి గండపెండేరపు గ్రహీత బహుముఖ ప్రజ్ఞాశాలి, నా పద్య గురువు, విద్వాన్ చక్రాల లక్ష్మీకాంత రాజారావుగారు ఎన్నో పనుల వత్తిడిలో ఉన్నప్పటికి, నా వినతి మేరకు నా పై గల అనురాగం వలన అంగీకరించి, కవి హృదయానికి, తలంపుకు, భావానికి ఏ మాత్రం భంగం వాటిల్లని రీతిలో పద్య పరిష్కరణచేశారు.. అంతే కాక రెండు అద్భుతమైన వృత్తమాలికలలో అన్నముని చరిత్రను మొత్తం పొందుపరిచి ఇచ్చారు. నా ప్రతి పనిలో వెన్నంటి ప్రోత్సహించే గురువుగా వారికి ఏమిచ్చినా ఋణం తీర్చుకోలేని వాణ్ణి. వారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు అర్పిస్తున్నాను.



అలాగే పద్యరంగంలో/ఛందోరంగంలో/అవధానాలు చేయడంలో నిష్ణాతులు, ప్రముఖులైన సర్వశ్రీ "కుదురాటగండ" పాలపర్తి శ్యామలానంద ప్రసాద్ అవధాని గారు , ఆకెళ్ళ బాలభాను శతావధానిగారు, ఎం.వి.పట్వర్ధన్ అవధానిగారు, హం.వే.స.నా మూర్తి అవధానిగారు, "శంకరాభరణం" బ్లాగు నిర్వాహకులు కంది శంకరయ్యగారు, తెలుగు, కన్నడ, తమిళ వంటి వివిధ భాషా ఛందస్సు విశేష పరిశోధనలు సల్పిన "ఛందశ్చక్రవర్తి" జెజ్జాల కృష్ణమోహన్‌గారు, పద్యకవిత్వ శిక్షకులు కట్టుపల్లి ప్రసాద్‌గారు, ఇలా ఎందరో పెద్దలు అడగ్గానే తమ పద్యాలను పంపించి నాపై ఉన్న అనురాగాన్ని తెలియజేశారు. అలాగే "ప్రజ–పద్యం" ముఖపుస్తకం బృందం నిర్వాహకులు అనంతకృష్ణగారు, ''అనంతచ్ఛందము'' బృందం నిర్వాహకులు తోపెల్ల బాలసుబ్రహ్మణ్యంగారు కవులలో విస్తృత ప్రచారం గావించి పద్యాలను సకాలంలో పంపడంలో ఎంతో సహకరించారు. అలాగే అడగ్గానే శ్రమకోర్చి బంధ, చిత్ర కవిత్వం వ్రాసి పంపిన బంధకవయిత్రి, సోదరి శ్రీమతి హంసగీతి , సోదరుడు 'మధురకవి గుండు మధుసూధన్ గార్లతో పాటు, హైస్కూలు చదువుతున్న బాలకవులు కూడా పద్యాలను పంపడం విశేషంగా భావిస్తున్నాను. వీరందరికి నా హృదయపూర్వక కృతజ్ఞతలర్పిస్తున్నాను.

శ్రీ సత్తిరాజు లక్ష్మీణారాయణ (బాపు) గారి చిత్రాలను కొన్ని జాతీయసంపదగా భావించి, అవి తరతరాలకు మరుగునపడిపోకుండా అందరిని అలరించాలన్న ఉద్దేశ్యంతో ఈ గ్రంథంలో స్వీకరించడం జరిగింది. వారి సంబంధీకులు సహృదయంతో మన్నిస్తారని భావిస్తున్నాను. అలాగే పుస్తకం వైవిధ్యభరితంగా ఉండాలని పాటలను వ్రాయాలని అడిగినప్పుడు, తాము అనేక వృత్తి వ్యాపకాలతో సతమతమౌతున్నా శ్రీ భువనచంద్రగారు, శ్రీమౌనశ్రీ మల్లిగారు మంచి పాటలను పంపించి నాకానందం కలిగించినందుకు వారికి కూడా కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

నెల్లూరు, అన్నమయ్య పాదాంఘ్రిరేణువు

09–08–2021 **డా.టేకుమళ్ళ వేంకటప్పయ్య**

ప్లవ – శ్రావణ శుద్ధ పాడ్యమి సంపాదకుడు





అవధాన భారతి, సాహితీచతురానన, ఛందోవైవిధ్య నిష్ణాత,
స్వర్ణకంకణ, కవిగండపెండేరపు సత్కారగ్రహీత
**విద్వాన్ చక్రాల లక్ష్మీకాంత రాజారావు ఎం.ఏ.,**
సంస్కృతోపన్యాసకులు, హైదరాబాదు (9291333880)

# "భావ నైవేద్యం"

'అదిగో అల్లదిగో' అంటూ హరివాసమును అవనీతలమున అందరికి చూపిన పదకవితా పితామహుడు శ్రీ అన్నమయ్యను గూర్చి పద్యములు రచించి పంపుడని ముఖపుస్తకమున ప్రకటించగానే, పద్యకవులు, కవయిత్రులందరు ఆనందతాండవము చేసి, అక్షరనీరాజనాలను, పద్య పుష్పహారాలను, హృదయజనిత మనోజ్ఞ భావనైవేద్యాలను, నానావిధచ్ఛందోబంధుర విన్యాసపు మ్రొక్కుబడులను కలియుగ ప్రత్యక్షదైవమగు శ్రీనివాసునికిని, శ్రీహరిదాసుడగు శ్రీ అన్నమాచార్యులకు సమర్పణము చేసి తమ మధుర భక్తిని ప్రకటించుకొన్నారు.

"సంఘేశక్తి: కలౌయుగే" అనగా సంఘటితమగు సమైకతా శక్తి కలియుగ ధర్మమని, అది యిలా కవుల, కవయిత్రుల పద్య రచనల ద్వారా సత్యమని నిరూపితమైనది. సామాన్యముగా కవులకు మాత్సర్యమెక్కువ. ఒకరి కవితను మరొకరు మెచ్చుకొనరు. కవితలలో, కావ్య కథనములలో రంధ్రాన్వేషణ చేయుచు తమ ప్రతిభాపాటవములను ప్రదర్శించుచుంటారు. నాయకరాజుల యుగమున "ఏ గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరే కదా!" అని చేమకూర వేంకటకవి అన్నారు. అది ఆనాటి మాట.

మరి నేడు – కవులందరు సహృదయులు. రసహృదయులు. ఒకరినొకరి ప్రేమతో ఆప్యాయతతో పలుకరించుకొంటారు. అలా కవులు, కవయిత్రులు ఉన్నారు



కాబట్టే నేడీ "అన్నమయ్యగారి గురించి వ్రాయండి" అన్న పిలుపుతో పద్య కవులు, కవయిత్రులు, దాదాపు అష్టోత్తర శతాధికులు తమ ప్రతిభను ప్రదర్శించుచు పద్యములను రచించి పంపారు.

జాతులు, ఉపజాతులు, వృత్తములు వీటితోడి పద్యములు మనోరంజకంగా ఉన్నవి. ఇంకొక విశేషమేమనగా వాడుకలో ఉన్న వృత్తచ్ఛందములే గాక, క్రొంగ్రొత్త ఛందములతో పద్యరచన గావించిన వారున్నారు. అందునా హైస్కూలు విద్యార్థులు పద్యరచన చేయడం అందునా దోషరహితంగా వ్రాయడం ముదావహం. దంపతులు సైతము ఇందులో భాగం పంచుకొన్నారు. ఆంధ్ర సాహితీ తారాపథాన పద్యము ధ్రువతారగా నిత్యనూతన కాంతులతో ప్రకాశించుచుండునని, యెందరు పద్యమును ఈసడించుకొన్నా అది ఆచంద్రతారార్కము వెలుగుచునే యుండునని ఈ సంఘటిత శక్తి ద్వారా ప్రకటితమైనది.

కొందరు కవులు అన్నమాచార్యుని పద్యములందు నుతించగా, మరికొందరు అన్నమయ్య కీర్తనలను పద్యములలో పొదిగించి, పాటలో పద్యం, పద్యంలో పాట అనేవిధంగా తమ ప్రతిభా కళను ప్రదర్శించారు. కొందరు శరచతుష్పది, కుసుమ చతుష్పది, త్రిపది, మానిని, మందాక్రాంత, భూతిలకము వంటి నూతనచ్ఛందములలో పద్యరచనలు గావించి, ఈ సంపుటికి క్రొత్త వెలుగు పంచారు. సంస్కృత శ్లోకములతో అన్నమయ్యను ఆరాధించిన వారున్నారు. అమెరికా, కెనడా మున్నగు దేశాలనుండి, మనదేశమందలి ఇతర రాష్ట్రములనుండి కూడా తెలుగు కవులు ఇందులో భాగం పంచుకొన్నారు.

సంతోషకరమైన విషయమేమనగా – ప్రతివారి పద్య రచనను చూచే భాగ్యం నాకు కలిగింది. మరికొన్ని క్రొత్త ఛందములు నాకు దొరికినవి. నాకున్న సంస్కృతాంధ్ర పాండిత్యమునకు, ఛందోజ్ఞానసంపదకు మరికొంత జ్ఞానవిభూతి





లభించినది. ఇది శ్రీనివాసుడు నాకు పరోక్షముగా నిచ్చిన దివ్యసంపద. అది అన్నమయ్య ద్వారా రావడము నా అదృష్టము. ఇలా కొంగ్రొత్త రీతులతో సాహితీ వ్యాసంగాలు, రచనలు జరగాలి. ఆంధ్ర భాషాభివృద్ధికినవి దోహదపడాలి.

"సర్వే బుధా: సుఖినోభవంతు"

ఇట్లు

హైదరాబాదు, బుధజన విధేయుడు

09-08-2021 **చక్రాల లక్ష్మీకాంత రాజారావు**



# అభినందన



**ఆచార్య సింగరాజు దక్షిణామూర్తి శర్మ**
**డైరక్టర్ - అన్నమాచార్య ప్రాజెక్టు**

డా. వెంకటప్పయ్యకు,

**"త్రికరణశుద్ధిగా చేసిన పనులకు దేవుడు మెచ్చును లోకము మెచ్చును"- అన్నమయ్య**

మీరు పంపిన సందేశం అందినది. మీ సంపాదకత్వంలో "హరిసంకీర్తనాచార్య అన్నమయ్య" అనే సంకలనం 111 మంది కవి పండితులు రచించిన పద్యాలతో కూడి ఉన్నదని తెలిసి ఆనందమయింది. మీరు అన్నమయ్యపై "అష్టోత్తర శతనామావళి" మొదలైన పుస్తకాలు తెచ్చినందులకు అభినందిస్తున్నాను. మీకృషి కొనసాగించవలసినదిగా కోరుతున్నాను.

**"శ్రీనివాసోఽభిరక్షతు"**

అభినందనలతో
తిరుపతి - 517 507
ప్లవ - శ్రావణ శు. పాడ్యమి
09-08-2021

*(సం) డా. ఎస్. దక్షిణామూర్తి*
**డైరక్టర్ - అన్నమాచార్య ప్రాజెక్టు**





# పరమహంస అన్నమయ్య

**భువన చంద్ర**

కవి, రచయిత, ప్రముఖ సినీ గీతరచయిత

(9840170646)

**పల్లవి:**

అణువు అణువునా కొండలరాయుని
నిలిపిన వానికి జేజేలు
అడుగు అడుగునా తిరుమల దేవుని
కొలచిన వానికి జేజేలు
పలుకు పలుకునా శ్రీపతి కీర్తిని
పొదిగిన వానికి జేజేలు
అహరహమూ హరినామము విడువని
అన్నమయ్యకూ జేజేలు మన అన్నమయ్యకూ జేజేలు

**చరణం:**

కదిలితె పాట మెదిలితె పాట
వరదుని తలచిన క్షణమొక పాట
తనువంతా శ్రీహరి మయమే
ఆతని రచనలు అద్భుతమే //అణువు //



**చరణం:**

ప్రతిపదమూ ఒక పుత్తడిపూవై – శ్రీపతి పదముల వాలినదా
ప్రతిశ్వాసా ఒక మాలగమారీ – స్వామిని తడిమి తరించినదా
శ్రీనివాసునిది ఎంత భాగ్యమో – కవీశ్వరుడే పదదాసుడాయెనే
//అణువు//

**చరణం:**

అక్షరాన్ని ఆభరణము చేసిన – హరిభక్తునకివె జేజేలు
భక్తి గంధమును పాటలకద్దిన – పరమహంసకూ జేజేలు
పలుకు పలుకునా శ్రీహరి కీర్తిని – పొదిగిన వానికి జేజేలు
అహరహమూ హరినామము విడువని – అన్నమయ్యకూ జేజేలు. //అణువు //









## హరి సంకీర్తనా సార్వభౌమ - అన్నమయ్య

మౌనశ్రీ మల్లిక్ (8919338546)
– కవి, సినీ గీతరచయిత

**పల్లవి:**

హరినామ సంకీర్తనమే ఆయువైన వాడు
శ్రీహరిలోన ఐక్యమై వెలుగొందినాడు
భక్తి భావ పరంపరను పండించిన వాడు
అనురక్తి లోన పరమపదం దర్శించినాడు
తెలుగు జాతిలో మెరిసిన వాగ్గేయకారుడు
పద కవితా పితామహుడు అన్నమాచార్యుడు // హరినామ //

**చరణం:**

శ్రీ వేంకటేశునకు ఇష్టమైన భక్తవరుడు
శ్రీవారి లీలలను లిఖించిన వాడు
శ్రీ మహావిష్ణువు నందకమే అతడు
శ్రీ వేంకటా చలపతి పరపతియే అతడు
త్యాగయ్య క్షేత్రయ్య రామదాసులకు
మార్గదర్శనం చేసిన మహనీయుడతడు
ఆంధ్రుల మానసచోరుడు అన్నమాచార్యుడు
ఆధ్యాత్మిక శృంగార గీతాలకు ప్రసిద్ధుడు // హరినామ //



**చరణం:**

అదివో అల్లదివో యని కలవరించినాడు
కనులముందు తిరుమలను నిలిపి చూపినాడు
చందమామ రావే యని పలవరించినాడు
శ్రీ పద్మనాభుడినే పరవశింపజేశాడు
జో అచ్యుతానంద జోజో ముకుందా
యని జోల పాటలతో అలరించిన వాడు
మనుషులంత ఒక్కటని నినదించిన వాడు
భక్తిలో విప్లవాన్ని రగిలించిన వాడు // హరినామ //







# వినతి

**- డా. టేకుమళ్ళ వేంకటప్పయ్య**

ఉ. నందక సంభవా! పదము నాలుగు దిక్కుల నిల్పినావయా!
సుందరభక్తిగీతమయి శోభిలె నెల్లరి చిత్తసీమలన్
మందిర సన్నిధానముల మందస మందున వేలకీర్తనల్
చందన మారుతమ్ములయి శాశ్వత కీర్తిని నిల్పెనీకహెూ!

తే.గీ. పద్య పుష్పమ్ములర్పింప నుద్యమించి
కవుల నడుగంగ సరియని కలముబట్టె!
నీదు సేవను జేయంగ నిర్ణయించి
చందనసుమాలు నీకిట్లు చల్లినాడ!

తే.గీ. కీర్తనావళి జాతికే కీర్తినిడుచు
కలియుగాంతమ్ము వరకును ఖ్యాతి నిలుచు
వేద వేదాంత సారమ్ము విదిత మవగ
నడుము గట్టిన మీకిదే నా నమస్సు!

ఉ. చెప్పుము శ్రీనివాసునకు చేరగ వేయుము నాదు కోర్కెలన్
గొప్పగు సేవలన్ సలుపు కోరికనుంటిని యార్తరక్షకా!
తప్పక చేయగా శరణు! తప్పుగ నెంచక శీఘ్రమే విన
న్నప్పెడి రీతిగా దెలుప నందక సంభవ! నీకుమ్రొక్కెదన్



 

## విద్వాన్ చక్రాల లక్ష్మీకాంత రాజారావు అవధాని

హైదరాబాదు

మ. హరిఖడ్గమ్మగు నందకమ్ము హరియాజ్ఞాప్త క్రియాసక్తతన్
హరి వైకుంఠము వీడి చేతనముతో నాదిత్య లోకమ్ము, భా
స్కర లోకమ్ము, కురంగ లాంఛన విలాసావాసమున్, వారిదాం
బరమున్, వహ్నిసఖాధి వాసమును సంభావించుచున్ దాటుచున్,
ధరణీధ్రమ్ముల దాకి వజ్రనిభమై దండించుచున్ శ్రీ వసుం
ధరకున్ దగ్గరి నిల్చి, ప్రాకృతిక సౌందర్యచ్ఛటాదీప్తికిన్
శిరమున్ వంచి, సభక్తికమ్ముగ హరిశ్రీరత్నమౌ ధాత్రికిన్
సరివందించి, మనోజ్ఞ భారతభువిన్ దర్శించి, యాపైన సుం
ధరభాషాప్రథితాంధ్ర రాష్ట్రమునకున్ దండమ్ములర్పించి, భూ
ధర వాసుండగు శ్రీనివాసుగని స్తోత్రమ్మున్ దమింజేసి, భూ
సురసంస్థానము తాళ్ళపాకగని యచ్చో నిల్చి సూరింటి మేల్
తరుణీ రత్నము లక్కమాంబయొడి వైలాస్యమ్ముగన్ డాగిలెన్
హరిలీలల్ ధరణీతలమ్మున పరివ్యాప్తమ్ము గావించు ద
త్తరుణావిష్కృత కాలదీధితికి డెందంబందు వందించుచున్

ఉ. ఆకరవాల మన్నయయై జనియింప మనోజ్ఞవేళ, జ్ఞా
నాకృతి వాణి నాల్కపయి నాట్యములాడగ, సంస్కృతాంధ్ర భా
షాకమలాధివాసుడని సన్నుతులందగ, శ్రీనివాసుడే
ఆకలిగొన్న బిడ్డగతి నార్తిని చేకొని కీర్తనావళుల్
వాకొని వ్రాయుమంచు దలవాకిట నిల్వగ దేవళాన, సు
శ్రీకరు నాత్మనెంచి మదితృప్తి వహించి రచించె గీర్తనల్



శ్రీకమలేందిరాపతిని చిన్మయ రూపుని దివ్యలీలలన్,
లోకపు బోకలన్, శిశువుడోలికలూపును, పెండ్లి సందడిన్,
వేకటి బాధలన్, వివిధ విస్తృత నిర్మల ధర్మబోధలన్,
రోకటిపాటలన్నిటిని రూఢిగ ముప్పది రెండువేలుగా
లోకము మెచ్చగా విబుధలోకము సర్వము మెచ్చునట్లుగన్
నా కలమిట్లు వ్రాయుటకు జ్ఞాన విభూతిని బంచినట్టి య
య్యాకమలాధివాసునికి నబ్జజురాణికి, నన్నమయ్యకు
న్నా కరవాల కార్యగతి కంజలి మోడ్చెద భక్తిభావనన్!



 

## 'కుదురాటగండ'

## పాలపర్తి శ్యామలానందప్రసాద్ అవధాని

1) తేనెంబూసిన కత్తి సామెతకు నందెన్ తావు నిన్మార్చియే
పేనెన్ తెల్విగ సామికత్తివయి తీపిం దేనెలౌ పాటలన్
వానింగొల్చితివబ్బురమ్ముగ బళీ! పైపైకి సింగారమై
లోనంద్రెంచును చావుపుట్టుకల నిల్పున్ 'తాళ్ళపాకన్' మదిన్

2) కూడుం గూడును కల్గియున్నపుడె చేకూరున్ మదిన్ బత్తి నన్
పాడన్ గొల్వను సద్ద కల్గునని చెప్పన్ సామి నీ యింటి పే
రీడౌ గూడుగ'తాళ్ళపాక'యనె కూసింతేని డొక్కాడగా
కూడౌ పేరుగ'అన్నమయ్య'యనెగా గోవిందుడే విందుగా

3) చిరుతనవ్వులు చిందగా వెరపెరుగక
గొల్లెతల నాటపట్టించు నల్లవాని
గుట్టులన్నియును బయటపెట్టినావు
అవుర!పెరుమాళ్ళ మించితి అన్నమయ్య!

4) అచ్చతెలుగుమాట ముచ్చటలన్నియు
సామిచెవిని వేయజాలినట్టి
తెలివి నీకొసంగె నలమేలుమంగమ్మ
ఆమె గూర్చి చెప్ప అన్నమయ్య!

 

## శ్రీమతి ఆకెళ్ళ బాలభాను, శతావధాని

అమలాపురం (9491174258)

1) కలియుగ దైవమున్ సరస గాన సుధాంబుధి ముంచి తేల్చుచున్
తెలుగున నన్నమయ్యకవి తియ్య దనంబును పంచె జాతి కిన్
సలలిత వాక్యగుంఫనము సాంద్రరసాన్విత భావజాలముల్
తొలకరి వాన జల్లు వలె దొయ్యలి నవ్వగ జల్లె భక్తి తో

2) వేంకటేశ్వర దివ్య నామము ప్రీతితో భజియించి నీ
వంకితంబును చేసి నాడవె యన్నమయ్య సుకీర్తనల్
పంకజేక్షణు సత్కృపన్ గొని పాట తోడుత పాపపుం
బంకిలంబుల పారద్రోలెదు వాంగ్నిధీ గొను నానుతుల్

3) పరమాత్ముని సంకీర్తన
నొరవడి గాజేసినట్టి యొజ్జవు నీవే
శరణాగత భక్తిని భువి
పరమౌన్నత్యమని వ్యక్త పరచితివయ్యా

4) అన్నమాచార్య పదకవితామృతరస
పాన మత్తులైన తెలుగువారి సుకృత
భాగ్యమున్ పొగడ వశమ భారతి తన
రూపు దాల్చి యిచ్చెను పదరుచులు భువికి



**హ.వేం.స.నా.మూర్తి అవధాని**

**(హరి వెంకట సత్యనారాయణ మూర్తి)**

విజయనగరం (9441320381)

శా. శ్రీమంతంబగు భక్తితో దలచెదన్ 'చిద్రూపియై క్షేమముల్
భూమిన్ గల్గగ జేయుచుండి విలసత్ పుణ్యప్రభావమ్ముతో
నామూలమ్ముగ పాపముల్ దునుముచున్ హర్షంబులన్ గూర్చు నా
శ్రీమద్వేంకట నాయకార్చకకవిశ్రీనన్నమయ్యన్ ఘనున్.

కం. పదకవితల కీయిలలో
నుదయించు బితామహుండు నున్నతుడు ఛవిన్
సదమలు దన్నమయార్యుడు
మది నచ్యుతు నిలిపినట్టి మాన్యుండతడున్.

శా. ఈపుణ్యాత్ముడు స్వీయభావధనమిం దింపారు రాగమ్ముతో
పాపప్రావృతలోకమం దనిశమున్ భవ్యాచ్ఛసౌఖ్యంబులన్
దీపిల్లంగను జేయగల్గిన మహాదేవున్ సమర్చింపగా
జూపెన్ పుష్పచయంబుగా తిరుమలేశున్ మ్రొక్కి హర్షంబునన్.

సీ. శ్రీహరివాసంబు స్థిరపై నట "నదిగో
నల్లదిగో"యంచు ననినవాడు
"బ్రహ్మ కడిగినట్టి పాద"మియ్యది యంచు
నిలవారలకు బూని తెలుపువాడు
"కొండల నెలకొన్న కోనేటి రాయని"
నలఘుభక్తిని సదా కొలుచువాడు





"తందనానా"యంచు దగ సమానత్వంబు
భవ్యమౌ రీతిని బలుకువాడు

తే.గీ. జీవనం బెల్ల శ్రీహరి సేవలకయి
యర్పణముచేయు కవివర్యు డనఘు డతడు
తాళ్ళపాకాన్వయాబ్ధికి ధవళయశము
లందజేసిన ఋషితుల్యుడన్నమయ్య.



# మారేపల్లి వేంకటరమణ పట్వర్ధన్ అవధాని

మంచిర్యాల (9393751540)

1) సదమల భక్తితోడుతను సప్తగిరీశుని దివ్యవైభవా
స్పద పదకంజయుగ్మమును బాగుగగొల్చితి వన్నమయ్య యో
పదకవితా పితామహుడ! భవ్య చరిత్రుడ! గొంతునెత్తి నీ
పదమునుబాడగా నఘముబాయుచు బుణ్యముగాంతుమెంతయున్

2) హరి నందక ఖడ్గంబే
యురు భవపాశముల ద్రెంచ నూర్జిత గతిమై
ధర నన్నమయ్య రూపున
హరి దాసుగ జన్మ మెత్తె ననగా ధ్రువమౌ

3) తిరుమల గిరియే యిల్లుగ
తిరువేంకటనాథు సేవ దృప్తిన్ గనుచున్
పరమానందము బొందిన
వర వైష్ణవ భక్త ముఖ్య ! వందనములివే !

4) రాజు నిద్రయు బంటు నిద్రయు నదొకటె
గొప్ప లేదింతయును సర్వకులజులొకటె
బ్రహ్మ మొక్కటె మరి పరబ్రహ్మ మొకటె
యనిన ఘనసామ్యవాదివీ వన్నమయ్య




# కంది శంకరయ్య

వరంగల్లు (7569822984)

 మ. కో. శ్రీనివాస కృపాకటాక్ష విశేష లబ్ధ కవిత్వ సం
ధాన పుణ్య పవిత్ర కార్య హితవ్రతాచరణాత్త ది
వ్యానవద్య పదస్థ జీవన భాగ్యలబ్ధ యశోధనా!
(జ్ఞాన దీప్త పదార్చనారత సాధు వర్తన! సత్కవీ!)
పూని ముప్పదిరెండు వేల్పదముల్ రచించి తరించితే!

కం. సంగీతము సాహిత్యము
సంగమమై భక్తిభావ సద్బోధకమై
రంగారు నీదు రచన ల
నంగన్ జెవి కోసికొంద్రు నానాడు జనుల్.

చం. పద కవితా పితామహ! సుభావ పరంపర వెల్లువైన నీ
పదముల బాడుచున్న యెడ పద్మదళాక్షుని దివ్యరూపమే
మెదలును మా మనమ్ముల సమీకృత మంజుల రాగ సంచయం
మ్మెద మురిపింప నీ పదములే తరియింపగ జేయు నెల్లరన్.

ఆ.వె. అన్నమయ్య నీ పదాబ్జములకు వంద
నమ్ము లంటిమయ్య నళిననాభు
డైన వేంకటేశు నభివర్ణనము సేయు
నీ పదమ్ములాన! నిజము సుమ్ము!



## జెజ్జాల కృష్ణమోహనరావు (JK Mohan Rao)

అమెరికా (1-301-695-5932)

ఉ. వెన్నల దొంగ, వేల్పులకు - వేలుపు, సుందర వేంకటేశ్వరుం
దున్నత శైలమందు బస - నుండగ, వానికి ముందు నిల్చి సం-
పన్నముగాను గీర్తనల - బాడుచు హర్షము నొందినావు, నీ
కన్నను ధన్యు లెవ్వరుర - గాన విశారద యన్నమార్యుడా!

శరచతుష్పది:

పంకజనేత్రుని - బావన చరితుని
వేంకటనాథుని - వినతులతో
నంకిత భావము - లలరగ బాడితి
వంకుర మవగను - భక్తిలతల్

అంగాంగమ్ముల - నాభరణమ్ములు
శృంగారముతో - జెలువిడగా
సంగీతముతో - జక్కగ గూర్చితి
వంగీకృతమై - యందఱకున్
(బేసి పాదములు: చ/చ - చ/చ, సరి పాదములు: చ/చ - చ/గ (చ - చతుర్మాత్ర, గ - గురువు)

కుసుమచతుష్పది:

శ్రీవేంకటేశ్వరుని - సేవించి సుందరపు
భావాల బాడితివి - పదములెన్నో





శ్రీవారి స్తోత్రమే - శృంగార గీతులే
జీవితముగా నీకు - జెలగెనుగదా

ఓయన్నమాచార్య - యుత్సుకత నిండంగ
బాయకను జేసితివి - పాదార్చన
ఆయనకు దేవేరి - యలమేలు మంగమ్మ
నీయనుగు తల్లియే - నిజముగాను
(బేసి పాదములు: పం/పం - పం/పం, సరి పాదములు: పం/పం - పం/గ (పం - పంచమాత్ర, గ - గురువు)

పంచమాత్రల సీసము, ద్విపద మిశ్రణము
(అన్నమాచార్యుల కీర్తన: పలుకు దేనెల తల్లి)

పలుకు తేనెలతోడ - బాటలన్ రచియించ
గలికి యలమేల్మంగ - కడు సంతసించె

అలుగగా నాదేవి - యలమేలు మంగమ్మ
ఖగవాహనుండు దా- గౌగిలించ
దెలుగు పదములందు - దీపి చేర్పించితివి
వెలిగించి దీపాల - విరులొసంగి
మగువ మోమున సిగ్గు - మదను దండ్రిని జూడ
రగిలించె గామాగ్ని - రమ్యముగను
సొగసుగా బాడితివి - శోభనాలను నీవు
నగరాజు ముద్దాడ - నగుమోముతోడ



# కట్టుపల్లి ప్రసాద్

హైదరాబాదు (8639963807)

ఉ. శ్రీహరి నందకాంశమున చిత్రముగా నట తాళ్ళపాకనున్ !
మోహము దీరగా శిశువు మ్రొక్కగ బుట్టెను లక్కమాంబకున్!
ఆహనమందొసంగెతనకద్భుత నామము నన్నమయ్యగన్!
తాహతు మేరకేయతని తల్లియు దండ్రియు బెంచెజక్కగన్
మోహితుడాయెగా నతడు మోహన రూపుడు శ్రీనివాసెడన్!

ఉ. పాలను ద్రాగడాయె హరి పావన నామమునాలకించకే!
పాడగ వేంకటేశ్వరుని పాటలె జోలగ నిద్రబుచ్చగన్!
బాలుడు శ్రీనివాసునిని భక్తిగ గొల్చుచు చిన్ననాటనే
పాడెను విస్తుబోవగను పండిత పామరులెల్ల గాంచియున్ !

ఉ. పాడిన పాటలే యమృత వర్షము మాటలె దైవగాథలున్!
వేడుచు బాడుకీర్తనలు వేంకటనాథ, నృసింహ, వైష్ణవుల్
తోడగు వేలుపుల్ మిగుల తోషముచెందగ సన్నుతించుచున్
వీడెను రాజ పోషణము వేడిన పాడక నేత కీర్తనల్ !

చం. పదలయకర్త శ్రీ హరికి భక్తుడు, సాహితివేత్త యీతడే
పదములతో సమాజమున బారెడు హెచ్చుయు దగ్గు బాప జా
టె దెగువ జూపి బ్రహ్మమొకటే పరదైవము నొక్కటంచు నా
పదకవితాపితామహుని పాదము మ్రొక్కెద నెల్లవేళలన్



## నారుమంచి అనంతకృష్ణ

హైద్రాబాదు (9246531895)

శా. నీ పాటల్ విని యన్నమున్ దినియనో నిద్రించెనో యాడెనో
రూపాతీతుని రూపవంతునటులన్ రూపించి కీర్తించగా
తాపాలన్ హరియించ నమ్మ పలుకన్ తామీయ భాగ్యమ్ములన్
చూపెన్ నాకును చందమామ పిలుపుల్ జో అచ్యుతానందముల్

ఉ. సందియమెన్న ముళ్ళపొద సర్వ సుశోభలు హానినొందగాన్
పొందుగ వాని దీయుటకు పొమ్మని స్వామియె పంపెనో యనన్
నందక ఖడ్గమట్లు బహు నవ్యత నిండిన భవ్యకీర్తనల్
చిందగ జేయ మానసము చిందులువేసెను స్వామి సేవలో

మ. చెలువల్ జీవులు స్వామి భర్తయగుటే శృంగార తాత్పర్యమై
వలువల్ జారుట దేహభావమనగా వైనమ్ముగా జారుటై
కలిలో భక్తులు మోక్షమార్గమరయన్ కారుణ్యమాకారమై
తెలిపెన్ తా శరణాగతిన్ పరమమౌ దివ్యోపదేశమ్ముగా

ఆ.వె. అన్న ప్రతిపదమ్ము నతులిత భక్తిని
పెంపుజేయు పెద్ద పేద యనక
నేర్చువారలకది నేడిట చూడగన్
అన్నమయ్య పాట అన్నమయ్య

 

# పువ్వాడ తిక్కనసోమయాజి

విజయవాడ (9885628572)

1) శ్రీమద్వేంకట రమణా!
నీమంజుల పదయుగళిని నిరతము గొల్చెన్
ధీమాన్యు డన్నమయ్యయె
ప్రామాణ్యములైన స్వీయపదములతోడన్!

2) తెనుగున జాలువాఱు తియతేనియ పల్కులు, తెన్గుగైతలన్
గననగు పూవుదేనియల కమ్మని తావులప్రోవు,లట్టి తీ
యని నుడికారపున్ లయల నల్లల నల్లిన అన్నమయ్య పా
వన పదగుంఫనమ్ము లహెూ భక్తులకున్ పరమార్థ తత్త్వముల్!

3) ఇంతకంటెను ఘను లెందులే' రనెనిన్ను
నతనికంటెను ఘను లవనిగలరె
'ఏమనిపొగడుదు నేనంచు' ననెగాని
యేమని నుతియింతు మామహాత్మ్మ
కొండల నెలకొని కోర్కు లీడేర్చు నిన్
కోరితెచ్చెను తన గుండెగుడికి
నానాటి బతుకది నాటకమ్ముగ తోచి
కైవల్యమునకదే గతిగ నమ్మె
బ్రహ్మకడిగిన పాదముల్ పట్టితాను
పలుకుతేనెల తల్లితో పలుక గలిగె:
వేటురి ప్రభాకర కవి పాటులెన్న
నెంత ఋణపడి యున్నదో ఈ ప్రజాళి!

 

4) ఏమీ సాళువనారసింహ ప్రభువా? యేమయ్య నీసింహపీ
ఠీమాంజిష్ఠ చిరత్న రత్నఘృణులన్ ఠీవిన్ వెలారించి మా
సామీచీన పరంపరాగత కవీట్ సామ్రాజ్యపట్టమ్మునం
దీ మా అన్నమయాత్మజాతమగు గ్రంథిన్ దుల్చి కైకొందువే?

5) తెలుగులో తెన్గుదనమది వెలుగు దనుక
మానవాంతర్యమున భక్తి వఱలు దాక
అన్న మున్నంత వఱకు, నీ యన్నమయ్య,
జనపదాల తత్పదములు శాశ్వతములు!!



# శ్రీమతి హంసగీతి

హైదరాబాద్ (9866955756)

చం. పదములు గూర్చుచున్ బసగ పాటల నందున నన్న మయ్య యా
పదముల తోడ సల్పెనట ప్రార్థన లన్నియు భక్తి తోడుతన్
పదముల మాల లల్లి యిడి పావన మూర్తికి సేవ జేయగన్
బదకవితా పితామహుని పాటలు ప్రాకట మొందె నిమ్మహిన్!!

చం. హరిహరి యంచు సంస్తుతిని నాహరి సేవల నన్నమయ్య తా
బరవశ మొంది పాటలుగ వ్రాసెను ముప్పది రెండు వేలటన్
హరి శరణమ్ము గోరి హరి నార్తిగ గొల్చుచు ధన్యు డయ్యె నా
హరికృప తోడ నందకుడు హ్లాదము బంచెను భక్తి తోడుతన్!!

మ. అదివో శ్రీ హరి వాసమంటు హరినే యగ్గించుచున్ భక్తితో
ముదమున్ దా రచి యించి వేల కృతులన్ మోక్షంబు బొందెన్ గదా
ఎదలో భక్తిని బెంచు కీర్తనములే హృద్యంబుగా మారెలే
మదిలో గొండల రాయు డంచు పరమాత్మన్ గొల్చు గీతంబులై!!

మ.కో. మోదమొందగ బాడుచున్ హరి పూజ సేవలు చేయుచున్
వేద సారము దెల్పుచున్ దన వేల కీర్తన లందునన్
సేదదీరుచు నన్నమయ్యయె శ్రీనివాసుని సేవలో
దాదరించియు మానవాళిని దా దరింపగ జేసెలే !!





# శ్రీమతి హంసగీతి (బంధ కవిత్వం)




## నందకాత్మజునికి నందకబంధ నీరాజనం

కం.హరిహరి గిరిధర యనుచున్ / మరిమరి స్మరియించె నన్నమాచార్యుడిలన్
స్వరరాగ కీర్తనలతో / దరించె నందకుని జన్మ ధన్యత తోడన్!







## శంఖచక్రధారీ! శ్రీవేంకటేశా! శరణు శరణు!!!

కం.దేవ దయాకర రారా !!
దేవర భక్తుల మొరలను దీర్పగ రారా!!
చేవనిడరా నగధరా!
దేవర హే పరమపురుష ధృతినిడ రారా!!

తే.గీ. నిచ్చలు హరిని గోరుదునే నగవును
హరికి మ్రొక్కుచు గోరుదు నవ్యయములు
హరిని వేడుచు గోరుదు హ్లాదము మరి
హరి సిరినిడ గొలుతును నే హరి హరి యని!

 

## 'మధురకవి' గుండు మధుసూదన్

వరంగల్ (6301264676)

చం. పదకవితాపితామహ! సుభావన మాంత్రిక! యన్నమయ్య! నీ
మదినిడి వేంకటేశ్వరుని, మానిత యుక్తిని దేనెలొల్కగా
సదమలరీతి గీర్తనల సన్నుతి సేసియు, దెల్గుభాషకున్
మృదుమధురంపు గీర్తనల మేల్మి కిరీట మలంకరించితే!

తే.గీ. అన్నమాచార్య పదకవితామృతమ్ము
మృదుమధుర రసాలాంచిత మేళనమ్ము
సరససుందరపదయుక్త సౌహృదమ్ము
సుజన సౌహిత్యభాసుర సుందరమ్ము!

మ. చెవులారంగ సుకీర్తనల్ వినిచి, మా చిత్తంబులన్ గెల్చియుం,
జవులూరించిన నిన్ను గొల్తు మిల నిచ్చల్ స్వాంతమందుం దగన్!
భవబంధమ్ముల ద్రెంచునట్టి పదముల్ ప్రార్థింతుమయ్యా, యిటన్
స్తవనీయంబగు పద్యరత్నములతో సద్భూషణల్ సేసియున్!

ఉ. ముప్పదిరెండువేల రసపూర్ణములౌ పదకీర్తనమ్ములం
జెప్పియు, దెల్గునేల కిల జేతన మిచ్చి, ప్రపంచ మంతటం
ద్రిప్పి, మహోన్నతంబగు ప్రతిష్ఠను జేకొని, దీప్తభానువై
యొప్పిన యన్నమయ్య సుజనోన్నత! నీకివె వందనావళుల్!

 

## 'మధురకవి' గుండు మధుసూదన్

### గర్భ కవిత్వం

**(కంద గీత గర్భ చంపకమాలా వృత్తము)**

చం. స్థిర పద సత్కవీ! స్ఫురిత దివ్య దయావర! భూజనాప్త! సా
దర కవితాత్మకా! విరివి ధన్యత నందియు, వేంకటేశుపై,
వర సదయన్, భువిన్ రచన బంచి, దయామయు ప్రాపు జొత్తె, చి
ద్వరు కృపతో! నిదే యడుగు దండము లిచ్చెద నన్నమయ్యరో!

**గర్భిత కందము:** పద సత్కవీ! స్ఫురిత ది
వ్య దయావర! భూజనాప్త! సాదర కవితా!
సదయన్ భువిన్ రచన బం
చి, దయామయు ప్రాపు జొత్తె, చిద్వరు కృపతో!

**గర్భిత తేటగీతి:** స్ఫురిత దివ్య దయావర! భూజనాప్త!
విరివి ధన్యత నందియు, వేంకటేశు
రచన బంచి, దయామయు ప్రాపు జొత్తె!
యడుగు దండము లిచ్చెద నన్నమయ్య!



## చావలి సాంబశివ సుబ్రహ్మణ్యం

విజయవాడ. (9985973239)

ఆ.వె. అన్నమయ్య! సత్య మజరామరము నీదు
కృతులు, పదము, లరయ కీర్తనలును
ఎవరినోట విన్న, నెచ్చోట గన్నను
భక్తితత్త్వ మొప్పె వసుధయందు!

ఉ. ఆస్తికులందు శైవులని, ఆ హరిభక్తులు, బౌద్ధులంచు నే
కాస్తగ వీలు చిక్కినను కక్షలతో జగడంబులాడు చా
దస్తపు వీరమౌఢ్యులకు తగ్గవిధంబున బుద్ధిచెప్ప, నా
నాస్తికు లెల్లవారలకు నాహరివాసము జూపినావహో!

ఆ.వె. బడుగు,ధనికవర్గ భావనల్ విడనాడి,
సకల భక్తజనుల సంఘటించి,
వేదసార మెల్ల విడమర్చి,నేర్పుగా
భక్తిసుధల బాట పరచినావు!

ఆ.వె. రక్తిలోనబుట్టి, శక్తివై రూపంది,
అస్తి, నాస్తి చర్చ నలసి, సొలసి,
తిరుమలేశు జేరి, హరికీర్తనాచార్య
పదము పదములందు బడసినావు!




## డా. మన్నవ గంగాధర ప్రసాద్

తిరుపతి (9398873442)

కం. అన్నమయా నీ పదములు
అన్నీ రసమయ సుధా విహారములేగా
విన్నా మయ్యా, విన్నా
మన్నీ వినసొంపయి.. మది యాతన దీర్చెన్.

కం. శ్రీవారికి అంకితమై
నీ వాదములను పదములు నెగడులు గాగా
సేవాభావము తోడుగ
జీవాత్మ తుదకు పరమును చేరుట తెలిసెన్.

కం. పరుగులు పెట్టే వారికి
విరుగుడు చెప్పిన పదములు విరసంబాయెన్
తరుగులు మెండని భ్రమసే
చిరుమానవులకు నడవడి చెప్పగ రావే.

తే.గీ. తెలుగులో భక్తిమార్గమ్ము తెలియ జేసి
మోక్ష మిచ్చు శ్రీదేవుని మ్రొక్కి చూపి
బ్రతుకు మాయల తొలగించు బాట వేసి
పదముల నిధి నిచ్చిన నీవె పరమగురువు.



## పోచిరాజు సుబ్బారావు

హైదరాబాదు (9866283384)

చం. పదములు పాట లింక బలు బద్యము లన్నియు శ్రీనివాసుపై
ముదిరిన భక్తి తోడ నిల మోదము తోడను వ్రాసినందుకే
పద కవితా పితామహుడు భవ్యుడు నాయెను లోక మంతటన్
ముదము సెలంగె జేయగను పుట్టిన యట్టి దినోత్సవమ్ములన్

తే.గీ. వేంకటేశుని నరసింహు వేలుపులను
సన్ను తించుచు భక్తిని శ్రద్ధ తోడ
వేల కొలదిగ గీర్తనల్ ప్రియము తోడ
నలరి పాడెను రచియించి యన్నమయ్య

ఆ.వె. చంద మామ రావె జాబిల్లి రావె నా
బంతి పూలు దేవె పాట లిట్టు
లన్ని యు మన భాష కమిత గౌరవ మిచ్చె
దెలుగు పదము లలరి తీయ నగుచు

తే.గీ. రాగి రేకుల మీదను రమ్యముగను
జెక్కి యుంచిరి భద్రమ్ము సేయ దలచి
యన్న మాచార్యులకు నరయంగ సాటి
జగము నందు గన్పట్టరు సత్య మెంచ



## డా. హరి వరలక్ష్మి (హరవే)

హైదరాబాదు (9908755542)

ఉ. ఆ హరి నామమే దురిత హారమటంచిటులేదుకొండలన్
ఆ హరి ఖడ్గమీ పరమ పావన జన్మకు నాంది బల్కగన్
ఆ హరి చూపుకై మిగుల హ్లాదము వీడెను దల్లిదండ్రులన్
ఆ హరి పిల్చెనంచు గల యాగక పర్విడె శేషశాయికై
ఆ హరి వేడ్కకై విడక వ్రాసెను వేల నభంగ కీర్తనల్

కం. హరి పదసంకీర్తనలను
మరిమరి రచియించి గాన మధురిమ బంచెన్
హరి ఖడ్గపు రూపుని గని
తరియించెను వంశముగద తథ్యము హరియున్

మానిని. జో యని పాడెద జోలలు నిద్రకు చోద్యపు స్వామికి జోతలివే
చేయవ నీయిల చేరువ నుండగ జేయుదు సేవలు చేరికనే
మాయల శ్రీహరి మానస మందున మర్వక నిల్వుమ మాధవుడా
ఆ యమ లక్ష్మియు నక్కన వీడగ నాత్రము గూడగ నా చలమే
మాయని భక్తిని మాదొర వీడను మానస పూజల మా హితుడా

ఉ. ఏ కులజుండు నేమి యెవడే మయినన్నిల బ్రహ్మ మొక్కటే
వ్యాకుల జిత్తమెల్లపుడు వ్యాపకముంచుమ గొండరాయునిన్
రాకుల మైన నేమిచట రాజని బంటని నిద్ర కాటినన్
ఏకపు నామమున్ దలచ నేమరుబాటును లేని మోక్షమే
మేకను సింహమున్ జతగ మేటిగ మేపెడు వాని దల్చుమా !





## మంత్రవాది వీరవెంకట సత్యనారాయణ

గుంటూరు (8121499695)

చం. కలియుగ దైవమున్ గనగ గానముతోడ నుతించుచున్ సదా
తెలియగ జేసి తీవు నిల దీరుగ స్వామిని నెవ్విధిన్ గనన్
బలు మధురంపు గీర్తనల బాడి జనాళికి భక్తి తత్త్వమున్
బలుదెఱగుల్ వచించితివి ప్రాకటమున్ హరిపూజ సేయగన్

మందాక్రాంతము. భారంబుల్ వీడి సరగున శ్రీపాదసాన్నిధ్య సేవన్
కోరంగన్ భక్తి పథమును గైకొంచు గీర్తింపగన్ ని
న్నా రాజీవాక్షుడు గొనగ నోయన్నమయ్యా! స్మరింత్రా
తారా చంద్రార్కము జనులు నీ ధన్యతా ప్రాభవంబుల్

పంచచామరము. పరాత్పరున్ గనంగ నీవు పర్వతమ్ము జేరగన్
వరమ్ము లేమి కోరలేదు వర్తిలన్ ముదమ్ముగన్
పరమ్ము కోరి భక్తితోడ పారవశ్య మొందుచున్
మురారి కీర్తనమ్ము జేసి ముక్తి నొంది నావయా!

సీ. సురపూజి తానంద శోభనా చలపతి
రాజీవ నేత్రుడార్త జన నాథు
డాదిదేవు డనంతు డఖిలాండ కోటి బ్ర
హ్మాండ నాయకుడైన యక్షధరుని
నవ్యయానంతుని నాది వరాహుని
నభిరూపు డక్షరు డమర విభుని



సప్తాద్రి నాథుని సామగానప్రియు
డమృతేశయుని నీరజాక్షు హరిని

తే.గీ. అన్నమయ్య కీర్తనలతో నద్రిపైన
మాతలిద్దరి గూడిన మహితమూర్తి
దలచి నిరతము గోవిందు ధ్యాన మందు
బ్రహ్మ కడిగిన పాదము బట్టి కొలిచె

 

# కందుల నాగేంద్ర వరప్రసాద్

ఏలూరు (9440110662)

చం. జగదధి నాయకా యనుచు సన్నుత కీర్తనలెల్ల చేసె నా
జగముల నేలు శాశ్వతుని సన్నిధి గోరుచు నన్నమయ్య యా
యగణిత సారసాక్షుని, సహస్ర సుశోభిత గాత్ర యోగ్యతన్
భగవదనుగ్రహమ్మునకు పాత్రులు వంశము నందు నెల్లరున్ !

చం. పదముల యందు నిల్పి ఘన వైష్ణవ తేజము హర్షమొందు సం
పదలను పొందె భక్తజన వత్సలు డౌ హరి పాద పద్మముల్
పదిలముగా సుపాణి యని పట్టి భజించుచు పారవశ్యమి
య్యదనుచు వేంకటేశ్వరు మదాత్మ విభుండని మ్రొక్కెనెప్పుడున్!

కం. విమలోత్సవంబున విభుని
తమ పద బంధములతోడ దలచుచు భక్తిన్
రమణీయ కీర్తనలతో
నమృతము మించిన హవిస్సు నందించె భువిన్!

ఆ.వె. తాళ్ళపాక వారి తన్మయత్వము గని
తరలి వచ్చి నాడు హరి హరుడయి
పదపదముల యందు పదము గలపి తన
భక్త వర్యునకిడె పరమ పదము!

 

## శ్రీమతి మానాప్రగడ సాహితి

గరివిడి, విజయనగరం (9989370358)

సుగంధి. తేట నైన కైత తోడ తీపి పాట రాసెలే
పాట తేనె వోలె సాగి భక్తి బెంచు నయ్యరో
పాట విన్న స్వామి యేమొ పవ్వళించు ప్రీతిగన్!
పాట లన్ని పాడు చంద్రి భక్తులంత నేటికిన్ !!

తే.గీ. పాటలందున వేంకటపతిని గనెను
పదము నందున కైవల్య పథము గనెను
అన్నమయ్య గానమవని నందు సాగ
నింగి లోనున్న వేల్పులు పొంగిరంట!!

తే.గీ. పాప పున్నెంపు క్రియలతో పరుగులిడుచు
చావు పుట్టుక నడిమిని చంచలించు
నరునిజీవన బాధలు నరక మనుచు
హరిని స్మరియించు మనె నయ్య యన్నమయ్య!!

తే.గీ. చిన్ని దేవకి ముంగిట చెల్వ వీడు
గొల్ల కన్నెల మనసులో గోము వీడు
మూడు లోకాల నేలెడు ముద్దు సుతుడ
టంచు పాడి పరవశించె నన్నమయ్య!!

 

# శ్రీమతి టి. లక్ష్మీకృష్ణ

గురుగ్రామం (9871616469)

మానిని. శ్రీహరి నందక తేజమె ధాత్రిని చిన్మయ రూపుని లీలను దా
దేహిగ నన్నమయార్యుని జన్మము దేవర గొల్వగ కీర్తనలన్!
సాహితి వీణను బాళిని మీటుచు సాధన జేయుచు రాగిలగన్
స్నేహము మెచ్చెను వేంకట దైవము సేవలు గోమున గైకొనుచున్!

కం. అలమేల్మంగ పతి హరిన్!
కలగనిన వలనున జూడగ నరయు వేళన్!
చెలువపు కలరూపమునే
దలపగ నన్నమయ మదిని దాదాత్మ్యములే!

కం. అణువు లజాండము లన్నిట
వణికపు దీప్తుల వఱలెడి వానిని గొల్వన్..
ఫణితమె పావన మంత్రము!
గుణ గానమదే జపముగ కూరిమి నలరెన్!

తే.గీ. తాళ్ళపాక న్నమయ్య పద కవితలవి..
రస గుళికల మధురిమలు! రాగ ఝురులు!
ఆపదుద్ధారక మగుచు నమృత మయుని
సన్నిధిని తరియింపగ సాధకములు!

 

## శ్రీమతి సువర్ణ విజయలక్ష్మి

కెనడా (1(514)965-4725)

ఉ. వెన్నుని ఖడ్గమే వరలి వెల్గులు చిందగ తాళ్లపాకలో,
అన్నమచార్య నందకము నందిన చందము నుద్భవించెనో,
ఎన్నియొ వేల కీర్తనల నెన్నగ వ్రాసెను వేంకటేశు పై,
వన్నెలు చిందు గీతముల వైష్ణవ భక్తిని పెంపుజేయగన్!

ఉ. సన్నుతి జేసె నచ్ఛమగు సంస్కృతి వైభవ మెల్ల చాటుచున్,
సన్నిధి జేర్చె భద్రముగ సంపద ముప్పది రెండు వేలు గా,
పెన్నిధి ! రాగిరేకులవి వేంకని తేజము తేజరిల్లగన్ ,
మన్నన లందగన్ ప్రజల మానస మందున వల్లరీ ఝరుల్ !

సీ. అలరులు కురియగ అలమేలు మంగమ
అమరాంగనల గూడి యాడు సొగసు,
కొండలలో నున్న కోనేటి రాయుని
పాదమే మ్రొక్కగా పరమ పదము,
కోమలాంగులు జేరి కొలనులో తేలగా
కోకల దాచిన కొంటె దనము,
చిరుత నవ్వుల వాని చెక్కిలి ముద్దాడి
చంచలాంబక చూపె చందమామ!

తే.గీ. లాలపోసి లాలించుచు లాలిపాట,
జోత లనుచు పరుండగా జోల పాట,



ప్రియములారంగశుభవేళ పెండ్లి పాట,
ఆలపించుచు పులకించె నన్నమయ్య!

తే.గీ. అంగనా మణుల్ చెటియొక అంకమమర,
అలర చంచల ముగ నిల అందమొలక,
ఊయల కుదుపులలతిగ నూపు చుండ,
వేడుకలు చూడ విందాయె వేంకటేశ!




## నేతి శ్రీకర్ (వయస్సు: 13)

హైదరాబాద్

1) తిరుమల తిరుపతి
గిరిపతి వెలసెను
హరి తన కరమున
వరముల నొసగెను

2) హరిహరి హరియని
మురిసెను మనసున
సిరిపతి పదముల
ఒరిగెను తలనిడి....

3) మనసున మెదలెను
వనమున వెదకెను
కనపడె సిరిపతి
తనమది మురిసెను

ఆ. వె. చక్రధారి కృపను జనియించె నప్పుడు
నందకాంశ యందు నందముగను
అన్నమయ్య మనకు నచ్చతెలుగు లోన
కీర్తనలను వ్రాసి కీర్తి పొందె!



# గుండా వేంకట సుబ్బ సహదేవుడు

కడప, (9440903363)

ఉ. “అందము సృష్టికిన్ మగువ నమ్మగ సంతుకు జన్మనీయగన్
గుందుచు లక్కమాంబ నినుగోరుచు నున్నది వేంకటేశ్వరా!
జిందగ బోసినవ్వులను శీఘ్రు మొసంగు” మటంచు వేడగన్
నందకమంశగా గలిగె నందను డన్నమయాఖ్యు దర్మిలిన్!

సీ. ఆటపాటల దేలు నన్నమయ్యనుగాంచి
బాధ్యత లెరుగని బడవయనుచు
సభ్యులింట దెగడ జన్యుడు విసిగి నా
రాయణ సూరి చిరాకు పడుచు
గాలిపాటలు మాని కానల గొర్లకు
మేత దెమ్మన లిక్కి చేతగొనగ
‘ పాప వల్లరుల శ్రీపతి నామహేతిని
పార దఋగుదను’ పాట వొదవి

ఆ. వె. సాగె తానె తనను యోగీంద్రుడను రీతి
శ్రీహరి మదినిండ చిన్ని వ్రేలు
తెగి రుధిరము గార తిరిగి కళ్లు, నయిన
వారు మెదలి కినుక భక్తి పుట్టె




తే.గీ. అమృత కావ్యమౌ మాటలనాడినంత
పరమగానమౌ పాటల పాడినంత
తెలుగు సంస్కృతి ప్రతిరూపములుగ మివుల
జనుల నాల్కల నాటె కీర్తనల తానె

మ. తిరమౌ ముప్పది రెండువేల పరమోత్కృష్టంపు సంకీర్తనల్
గిరిధారిన్ తిరువేంకటేశ్వరుని భక్తిజ్ఞాన వైరాగ్య ముల్
దొరలన్ గానములాడి కొల్చి తగ సంతోషాంబుధిన్ దేల్చగన్
బరమున్ బొందెను దేవదేవునెదలో బాలాజి సాకారతన్



## ఎన్.సిహెచ్.శ్రీరామ చక్రవర్తి

హైదరాబాద్ (9399958069)

మ. తెనుగుందల్లికి వేలవేల పదపంక్తీందీవరాలిచ్చి, కీ
ర్తనలన్ శ్రీహరినర్చజేసి, బయకారత్వమ్మునన్ వెల్గి, య
గ్రణిగాభక్తులదీరినావు,కృతులాలాపింపగా వించు న
ర్తన మాడుంగద యన్నమయ్య! హరిమోదంబొప్పగా నాత్మలన్.

ఉ. పంకజనాభుడున్ విమలభక్తికిదాసుడు, నీ హృదబ్జ సౌ
ధాంకనివాసుడైచెలగిహాయినిబొందుచు గాచువాడు తా
గింకరులైనవారలొకకీర్తన బాడ, త్వదీయజీవితం
బంకితమిచ్చినీపదములందున గొల్చితివన్నమయ్యహో!

సీ. రాగాల శ్రీయనురాగాలు వర్ణించి
సద్భక్తివిష్ణుప్రసాదమిచ్చి,
గానాలనజకథాస్నానాలదేల్చి భ
క్తులను దాన బరిశుద్ధులను జేసి,
పదములనర్చించు వారినేడేడు జ
న్మల పాపముల విముక్తులను జేసి,
తాళాల సప్తసంతానాల ఫలమిచ్చి
పాటలం బెద్ద సాపాటుబెట్టి,

తే.గీ. శ్రీనివాసుని ప్రఖ్యాతిలోన సగము
తానుగూర్చిన పుణ్యాత్ముడైనవాడు
తాళ్లపాకాన్వయ హరితత్త్వజ్ఞుడాత
డన్నమయ శ్రీగిరీశుని యాత్మ దలతు



## గెంటేల జగదీశ్చంద్ర కుమార్

హైదరాబాద్ (9849383814)

1) తాళ్లపాకవంశంబున తాజనించి
కాల హరుడైన శ్రీశునిమేలు కొల్ప
తనదు సంకీర్తనలతోడ ఘనత మీర
నాలపించె సద్భక్తితో నన్నమయ్య

2) సరగున వరము లొసగిన స్వామి వయ్య
తలచిననిను క్షణము నందు దరిని జేరు
నేమి పుణ్యముజేసెనో యేవ్రత మును
సలిపెనోభారతావని,సంతసించె!

3) లక్కమాంబగర్భంబునలక్షణముగ
జననమొందినీవుసకలజగములందు
కీర్తిబడయనీకేతగు కేశవాంశ!
అన్నమాచార్యవైతివి యవని యందు

4) శ్రీనివాసుపైముప్పదిరెండువేల,
కీర్తనలువ్రాసి పాడిన కీర్తిమంత,
రాగయుక్తికి, గానంబురక్తికట్ట,
తిరుమలగిరివాసుడుకడుతృప్తి నొందె !

5) స్వామికెపుడునీవత్యంతసన్ని హితుడ
వంచునుదెలిపెభక్తినీవాలపించు,
కీర్తనలుసంతసంబిచ్చెకేశవాంశ ,
హృదయమందిరమందుకవీశ్వరుండ!



## డా. గోసుకొండ సుబ్రహ్మణ్యం

ముంబై (9819218122)

తే.గీ. ఏది వలపేది? వగపేది? యేది సుఖము?
మగువ సొగసుల బిగువుల మరులు జిక్కి
మదిని పరమేశు చింతన మరచి యున్న
మనిషి జీవన ఫలమేది? మనుగ దేది?

ఆ. వె. సిరిని పెండ్లి యాడి శ్రీమంతుడైతివి
కటకటలబడి నిను కాన వచ్చు
వారి కాన్క లడగ పాడియే? సిరి గోర
నీకు? బత్తి సిరులు నీవి కావె?

తే.గీ. ఏల మడులేల? ధనమేల? యేల లబ్ధి?
తొల్లిభాగ్యమెల్ల కడకు కల్ల కాదె
ఎండ మావులు దాహార్తి నెట్లు తీర్చు?
శ్రీనివాసుండు మదినుండ సిరులవేల?

తే.గీ. చల్లరే హరిపై పూల జల్లు లింక
విసరరే వాలుజడలన్ని విష్ణువలర
పాడరే విభుని వలపు పాటలింక
చేరరే హరి యేకాంత సేవ సేయ.




ఆ.వె. చదువు లెన్నొ నేను చదివితి, చదివిన
చదువు లన్ని నాడె మదిని వదలె
చదువు మర్మ మేది చదువగ తెలియదు
చదువనంగ కాదు చద్ది మూట

తే.గీ. పాత కాలపు చదువని పలుకుటేల?
పాప నాశన మొనరించు పాఠములివి
వేల్పు లెల్లరు కొలిచెడి వేంకటేశు
విభవ మంతయు వివరించు విద్యలవియె

 

# మరింగంటి శ్రీనివాస్

సికిందరాబాద్ (9676534589)

ఉ. సూరియులక్కమాంబలకుసూనుడుగా జనియించి యన్నమా
చారిగ నామమున్ బడసి,చక్కని కీర్తన లందజేసి శ్రీ
వారికి పూలమాలలుగ వందల నీయగ పాటలన్ని సం
చారము జేసె నెల్లెడల జాగృతి సల్పుచు దైవభక్తితోన్

తే.గీ. పద కవితల నిండు నెపుడు పంచదార
తెలుగు కీర్తనలు రచించె తేనెలూర
పనస తొనల తీపిదనమ్ము పాటలందు
ఆలపింతురందరెపుడు హాయిగాను

కం. పిల్లల యాకలి దీర్చగ
తల్లులు పడుచుండునట్టి తపనలవెన్నో
చల్లని జాబిలి జూపగ
మెల్లగ తిందురుగ బువ్వ మేదిని యందున్

కం. పదకవితల నెన్నింటినో
ముదమలరగ వ్రాసె నతడు ముచ్చట గొల్పన్
నదులుగ ప్రవహించి నవియె
పదుగురు నోట వినిపించు పల్లవు లాయెన్

 

## శ్రీమతి తుమ్మలపల్లి విజయలక్ష్మి

హైదరాబాద్ (8008009954)

కం. నందక ఖడ్గం బది– రూ
పొందిన దన్నమయ గాను– పుడమిన్నెలమిన్
వందలు, వేలుగ పదముల
నందముగా వెలయజేసి– యరిగెన్ దివికిన్!

మ.కో. వేంకటేశుని కీర్తనంబులు వేనవేలు లిఖించి– దా
వేంకటాధిపు ప్రాభవంబును– వేయి గొంతుల బాడుచున్–
సంకటంబుల బాపు నాథుని సంతసింపగ జేయుచున్
వేంకటేశ్వరు బాద సన్నిధి వీడె జన్మము నంత్యమున్!

తే.గీ. అన్నమయ్య పాట వినని యాంధ్రుడేడి ?
లాలి "జో యచ్యుతానంద" రాని జనని–
"చందమామ రావె" యనుచు చంకనున్న
బిడ్డకు దినిపించని తల్లి– వెదుక– లేదు!

తే.గీ. పదకవితకు నాద్యుడునై–
పదముల నలవోక గాను– పరచెను గద– శ్రీ
పదముల మ్రోలను భక్తిని–
పదుగురి నోటను ప్రియముగ– వరలన్ సతమున్!

 

# శ్రీమతి కడియాల శ్రీదేవి

కఠెవరం, తెనాలి (9908688220)

ఉ. నందవరీక వంశమున నాణ్యత బెంచగ తాళ్ళపాకలోన్
డెందము ఝల్లుమంచనగ ఢింబకు డన్నమ చార్యుడర్మిలి
న్నందముతోడుతన్ బితరులాశకు పూర్ణత దీర్చినట్లుగన్
సుందరతన్ దమిన్నిడుచు చోద్యము చూపెగ శేషసాయికిన్

చం. తరతమ మద్దిలేదుమరి దారి యిదేయని యెంచిచూచినన్
నిరతమువేంకటేశ్వరుని నెమ్మది నమ్మిక మీరగొల్చుచున్
పరమదయాళుడైజనుల పాట పదంబుల తన్మయంబవన్
మరిమరి కీర్తనల్ వరుస మంత్రపు ధ్యానము సల్పుచుండెనే!

ఆ.వె. ఇప్పు డిట్టు గాక నెల్ల లోకములకు
అప్పడైన వేంకటప్ప గంటి
సేవ జేసె దాసు చేతికంకణమునై
చేవ దేరి వచ్చె చిన్ని కృష్ణ!

తే.గీ. తెగదు పాపమ్ము, పుణ్యమ్ము తీరదనుచు
నట్ట నడుమన పనులవి నాటకములు
నగును, నడుమన కాలమ్ము నాటకమ్మె
ఇందరికిని కందువ వేంకటేశుడొకడె!

 

## బంధకవి శ్రీమతి సుబ్బలక్ష్మి

హైదరాబాద్ (8790958045)

ఉ. జోలలు పాడి శ్రీహరిని చోద్యము నందగ లోకమంతయున్
లాలియటంచు నిద్దురకు రమ్మని పిల్చిన నాటి పాటలన్
జోలగ పాడి తల్లులును చూపిరి యాతని గానమాధురిన్
కాలము నందు శాశ్వతపు గౌరవమేర్పడ నన్నమయ్యకున్.

సీ. వాగ్గేయకారుండు వసుదేవ సుతుగొల్చు
నందకాంశ భవుడు నాదమౌని
నందవరీకుండు నారాయణుడు తండ్రి
లక్కమాంబ జనని లక్షణముగ
తిరుమలరాయని తిరముగా పూజింప
నందక మీభువి నటనమాడె
విష్ణుదీక్షనుబొంది విభవంబుగానిల
నన్నమాచార్యుడై యవతరించె

తే.గీ. భక్తి శృంగార వైరాగ్య భావములను
తనదు కీర్తనలందున తనియజేసి
పదకవితకాద్యుడగుచును పరిఢవిల్లె
తాళ్ళపాక నివాసులు తనివిదీర

## హరిసంకీర్తనాచార్య అన్నమయ్య



కం. హరినామము వినినంతనె
పరవశమును పొందుచుండు పాపనిగనుచున్
హరి సర్వోత్తముడనుచును
పరిపరి విధములనుతించి పాడిరిజనులున్.

సీ. ముద్దుగారు యశోద ముంగిట ముత్యమౌ
చిన్ని కన్నయ్యను చేరికొలిచి
బ్రహ్మమొక్కటియని బ్రహ్మాండమంతయు
పరమాత్మయనుచును పాడి యాడి
అదివొయల్లదియది హరివాసమనుచును
తిరుమలకొండను తీర్థములను
క్షీరసాగరకన్య శ్రీమహాలక్ష్మిని
ముదముతో కీర్తించి ముచ్చటించి

తే.గీ. వేయి విధముల వేడ్కతో వేంకటేశు
కీర్తనలు పాడి వేడిన కీర్తి ధనుడు
హరిని మురిపించి మురిసిన యన్నమయ్య
దివ్య పదముల నుతియింతు దినము దినము.





## శ్రీమతి నండూరి అనూరాధ

మంగలపాలెం (7995365769)

చం. పెదవులు విప్పినంత గళవీణలు మ్రోగును బత్తిపాటలై
మృదువగు నీదు వాక్కులిలమెందుగరంజిలు గేయపుంజమై
హృదయగృహాల నిల్వగ! మహీతలమందున శాశ్వతమ్ముగన్
పదకవితా పితామహ! సువైష్ణవదాసుడ! అన్నమయ్యహెూ!!

మానసీ . వేంకట రాయుని వేగమె రమ్మని వేదన తోడను వేడితి వే
సంకట హారియు సంతస మొందుచు చక్కగ వచ్చియు శాంతము తో
పంకజ నేత్రుడు పాపవిదూరుడు పాపము లన్నియు బాపెనుగా
పొంకమ దేలర పుణ్యము నిచ్చెను పూజలు గైకొని పూనికతో.

చం. తిరుమల శ్రీనివాసుడు మదిన్ మెదలన్ రచియించె కీర్తనల్
తిరుపతి వేంక టేశ్వరుని దివ్య పదాబ్జ ములన్ దలంచుచున్
మరిమరి యాపదంబులను మర్త్యులుపల్కుచు పాడుచుందురే
పరిపరి రీతులన్ బిలిచిపాడెద నన్నమయార్య కీర్తనల్.

తే.గీ. లాలి పాటలు,మురిపాల జోల లైన
జావళీలైన,కీర్తనల్,జానపదులు
పదకవితలల్లి తరియించి భక్తి తోడ
ప్రథమ వాగ్గేయ కారుడై ప్రతిభ గాంచె.



## శ్రీమతి భమిడిపాటి అరుణమణి

సికింద్రాబాద్ (7396939621)

తే.గీ. శ్రీనివాసుని వరమున చింత దీరి
లక్కమాంబ నారాయణ ప్రాజ్ఞులింట
తాళ్ళపాకన హరిభక్తి తత్పరుండు
నదరు నందకాంశన బుట్టె నన్నమయ్య.

సీ. ఉగ్గుత్రాగెడి వేళ నూయలూగెడి వేళ
 నూకొట్టి శ్రీహరి యూసువినుచు
బాల్య మందు పరమభక్తి తోడ వెడలి
 సిరిని శ్రీహరిని దర్శించి నీవు
వేల పాటలుపాడ వేంకటేశుని చెంత
 నలమేలు తలనూపి నాలకించె
స్వామి సన్నిధిజేరి సంకీర్తనల్ చేసి
 శరణు వేంకటపతి శరణమనగ
తే.గీ. తిరముగ హరిచింతన తోడ పరగు నా తి
రుమల వాసుని దివ్య పదమున జేరు
పదకవితల పితామహా! పరగు శ్రీప
తికిని నీదు కీర్తనలు సంతృప్తినిచ్చు!

సుగంధి. వెన్నుడైన సత్యుడైన వేంకటేశుడైననున్
విన్నపాలు వింటిరయ్య వెన్ననారగించు చున్
భిన్నమైన జాతులున్న భేదభావ మెంచనీ
యన్నమయ్య పాటవిన్న నాంధ్రజాతి ధన్యమే.



## శ్రీమతి నాగజ్యోతి రమణ సుసర్ల

బెంగళూరు (7406461234)

కం. నారాయణ లక్కమ్మలు
కూరిమిగల దంపతులిల– గుణసంపన్నుల్
కోరుచు సంతతినీయగ
చేరిరి మ్రొక్కుచు తిరుమల, – శ్రీహరి కడకున్!

సీ. అదె తిరుమలగుడి నెదురుగ శ్రీపతి
కట్టుబడు ముడుపు కట్టినంత
ననుచు నెమ్మది నమ్మి యండను జేరిన
భక్త దంపతుల సద్భావమెంచి
బిరుదుగజ్జెల కత్తి ప్రియముగా దానంపి
సాధ్వి గర్భమునందు జన్మమిచ్చి
అన్నమయ్యాభిధేయావతారమునిచ్చి
పదకవితల తిరు పథము నిచ్చి,

ఆ. వె. చిన్న యన్నమయ్య చెన్న కేశవయని
చనువుతోడ బిలచి సరసజేరి
తేనెలోన మాగు తీపి మామిడికన్న
ముద్దు కవిత జెప్ప మురిసె స్వామి!

చం.(షట్పది) ఎనిమిది వత్సరమ్ములకు నెల్లలు దాటిన భక్తి భావమున్
కనుగొనె వేంకటేశ్వరుని గాంచగ యాత్రను చేయువారలన్

 

వెనుకొని పాదరక్షలను వీడక కొండల నెక్కునంతలో
కినుకన, ప్రాపునీయకను గెంటగ స్వామియె క్రిందికొండకున్
అనునయ మిచ్చి యన్నమిడి నమ్మయె దెల్పగ తప్పులేమిటో
తనరిన పారవశ్యమున దా శతకమ్మును వ్రాసె తల్లిపై!

సీ. చేరి శేషుని కొండ చేకూర హరియండ
దివ్యమంగళ మూర్తి దీప్తులలర
పదునైన పిడిబాకు సుధలూరు శృంగార
భావకీర్తనలల్లి సేవలమర
మేలుకొల్పెడి పాట జోలలూపెడిపాట
జోడు శ్రీమతులతోనాడుపాట
ఆకలైతేపాట యలుపైన నొకపాట
వేంకటా చలపతి వెలయు పాట

ఆ.వె. పాటలన్నమయ్య –పదకవితలకయ్య
తెలుగు జాతి కీర్తి వెలుగులయ్య
పాటలందు మురిసి –పాటయై తరియించి
అలుపులేని తత్త్వమైతి వయ్య !

 

## సుజన దుర్భా

అమెరికా (01 (469) 586-6275)

ఆ.వె. బ్రహ్మమొక్కటి మరొ బ్రహ్మమే యదియని
అందరికిని హరియె అంతరాత్మ
యనుచు జెప్పె ధర్మ మన్నమయ్యానాడు
తందనాన భళిర! తందనాన!

తే.గీ. బంగరు శిఖరములబహు బ్రహ్మమయము
నింగినున్న దేవతలకు నిజనిలయము
అదియె జూడుమదియె మ్రొక్కు హరికినెపుడు
నదియె వేంకటాచలమనెనన్నమయ్య!

సీ. పుట్టుటయు నిజమ్ము పోవుటయు నిజమ్ము
నట్టనడిమి పని నాటకమ్ము!
కుడిచెడి దన్నమ్ము కోక జుట్టెడిదట
నడ మంత్రపు పనియె నాటకమ్ము!
తెగదట పాపమ్ము తీరదు పుణ్యమ్ము
నగి నగి కాలమ్ము నాటకమ్ము!
ఎగువనె శ్రీ వేంకటేశ్వరుడేలిక
గగనమ్ము మీదిది ఘన పథమ్ము!

ఆ.వె. పూని తాను జెప్పె నానాటి బ్రతుకులు
నాటకమ్మనుచును నరుడ వినుము!



పాదములను బట్టి ప్రార్థింతు పరమాత్మ
మోక్షమిచ్చి సుజన మోహమణచు!

ఉ. వింతల విన్నపాలు విన వేగమె పన్నగ మెత్తి లేవయా!
అంతట వేచినారు గద యంకెల మెల్లగ రెప్పలెత్తుమా!
కాంతుల మూడు లోకముల కామ్యము దీర్చెడి కల్పవృక్షమై
చెంతను వేంకటేశ్వరుడ! చేరిటు గాంచుము శ్రీనివాసుడా!

సుగంధి. అన్నమయ్య దారి జూపె నంబుజాక్షు జేరగా
ఎన్ని వేల పాటలాత డెంత యార్తి వ్రాసెనో
చిన్నపెద్ద లాలపించు శ్రీనివాస భక్తులే
విన్నవారు గాంతురట్టె వేంకటేశ రక్షణన్!





## శ్రీమతి విమల ఆర్యసోమయాజుల

హైదరాబాద్ (80562 36825)

సీ. చక్కని పాటలు జానపదమ్ములు
వేంకట నాథుని వేల గీత
ముల, నలవోకగా ముచ్చట గూర్చంగ
రచియించె నెంతయు రమ్యముగను
భగవంతునికి జేయు పదునాఱు సేవలు
పదము పదము నందు పరవశమున
జోలలే పాడెనో లాలియే పాడెనో
యన్నమయ్య పలుకు నచ్యుతునకు

తే.గీ. గంధమును బూసిమరి,మరి, కస్తురి తిల
కమును, తీరుగా దిద్దుచు కట్ట బెట్టె
పచ్చని పటము మేలిమి పసిడి తోడ
హరికి సింగార మొనరించె హర్షమూని

కం. హరి కరమున జారిన దా
కరవాలము లక్కమాంబ కడుపున శిశువై
సురలును మెచ్చెడు విధముగ
విరచించిన గీతుల విన వేడుక గల్గున్

కం. నందక మా నారాయణు
నందనుడై జన్మ నొంది, నాదాత్ముండై
యందమగు గీతములు గను
విందొనరించ రచియించె వేంకట పతికిన్

 

## శ్రీమతి బేతపూడి ఇందుమతి

హైదరాబాదు (99890 09001)

మ. అదివో యల్లదె నీ నివాసమని తానాలాపనన్ జేసెనే
అదివో చూడరె నందరున్ననుచు తానానంద భావాత్ముడై
యిదియే మర్మము జూడుమా యనుచు తానిక్షూద మందించెనే
మదిలో వీడక యన్నమయ్య హరి నామంబున్ స్మరించెన్ సదా

మ. కో. అన్నమయ్యగ తా జనించెగ నంతరంగమునందు వెం
కన్నభక్తి రసాలపేయము కన్నబిడ్డడు ప్రాకి తా
చన్నుబాలను పీల్చినట్లుగ చక్రపాణిని దల్చుచున్
అన్నినీవని బత్తిపాలటు లారగించె ముదంబునన్

భూతిలకము. రక్తిగ మోడుచు పల్లెపాటల రాగమున్ పలికించె తా
యుక్తవయస్సున అన్నమయ్య యహెూయనంగ జనావళుల్
భక్తిగ పాడుచు పాటలన్ హరిభక్తిచాటెజగంబునన్
ముక్తిని బొందెను వేంకటేశ్వరమూర్తి చెంత మహాత్ముడై!

తే.గీ. తియ్యని పదములను జేర్చి తెలుగు గీతి
రుచుల నన్నమయ్యనొసగె ప్రోఢిగ తిరు
పతిని గోవిందుడుని గూర్చి పాడి చలప
తికి సమర్పించె మురియగ తెలుగుజాతి!

 

## ధూళిపాళ అర్క సోమయాజి

భీమవరం (944177578)

 మ. అల “నారాయణ–లక్కమాంబ” ల సుతుండై నందకాంశంబునన్
తెలుగుం బల్కులు నుగ్గుపాలనగ బ్రీతిన్ గ్రోలుచున్ జోలపా
టల నూకొట్టుచు,పాంథ పాళి వెనువెంటన్ తిర్మలం జేరి వేం
కట నాథుం గనె!నన్నమయ్యదె!జగత్కల్యాణమిద్ధాత్రికిన్.

శా. అలమేల్మంగ స్వయమ్ముగా సుమధురాహారమ్మునందించి నీ
యలుపుం దీర్చిన భాగ్యశాలివి గదయ్యా!యన్నమయ్యా!సుధా
కలమాన్నమ్మయి నీదు గీత రచనా కౌశల్య భాగ్యమ్మునన్
తెలుగుం బల్కుకు బెద్దపీటె! యగు! ధాత్రిన్ వెల్గు సంకీర్తనల్!

ఉ. నీదగు భక్తి కీర్తన లనేకము లౌపనిషన్మహత్వమై
గాదిలి నిద్రపుచ్చుచు,సుఖమ్మిడుగా బవళింపు సేవ మ
ర్యాదను వేంకటేశు హృదయాలయ మందున డోలలూగు!నీ
నాదమహత్వ శక్తికి ,ప్రణామము లో పదకర్తృ శేఖరా!

ఉ. తేట తెనుంగు పల్కు లొక తీరుగ గూర్చి స్వరాల దండియన్
మీటుచు రాగ తాళ లయ నేరిమి పల్లెపదాల సౌరులన్
పాటలె మాటలై వరల భక్తియె ముక్తికి సౌధమంచు దా
జాటిన యన్నమయ్య కవి సర్వ జన స్తవనీయుడిద్ధరన్.



# కడయింటి కృష్ణమూర్తి

మడగావ్, గోవా (9422846926)

ఉ. మీరలు వేంకటేశ్వరుని మెప్పులబొందిన వారలెన్నడో
మేర లెరుంగరంటగద మేకొని స్వామిని యన్నిపూజలన్
వారము వారమున్ దమకు వాదన లంటగ దేవదేవుతో
బేరము జేసిరంటగద వేగమ వింగను విన్నపాలనున్

చం. పదములె చాలురాయనగ పాటల దేల్చితి వాదిదేవునిన్
పదములె పాటలై బఱగె, పండిత పామరు లందరౌనన
న్నెదలను గల్ల జేసెగ నభీష్టత  మోక్ష పదానుసారులై
పదముల బట్టివేడెదను భక్తుల సేవను పారమందెదన్.

ఉ. కేవల మర్త్యుడే యతడు క్షేమము లడ్గను వేంకటేశ్వరున్
కేవల భక్తుడే యతడు కేలును బట్టను మిత్ర బంధము
న్నావల నీవలన్ గనుట యంతటి వాక్కుల గేయకారునిన్
కేవల మిథ్యయే యగును కేలు మొగిడ్చెద మన్నమయ్యకున్

ఉ. పిన్నలకెంతజేసితివి పిల్చిన చంద్రుని యంతలోననే
యన్నము దిందురే మఱియు నచ్యుతు నిద్రకు జోలబాడితే
పిన్నలు నిద్ర జెందుదురె! పిల్చిన బల్కడు దైవమాయనన్
అన్నమయా దయామయుడివయ్య! యివే గొనుమా నమస్కృతుల్





## తుమ్మోజు రామలక్ష్మణాచార్యులు

విజయవాడ (9703776650)

ఉ. రాయల సీమ మాండలిక రాట్పద సంయుత సజ్జితంబునై
హాయిగ విన్బడున్ చెవుల, నా హరణంబును జేయపాపముల్
తోయజ పత్ర నేత్రు వివిధోన్నతభక్తి విశేష కీర్తనల్
వాయక నన్నమయ్య కడు భక్తిని నాడుచు పాడినాడహో

శా. బ్రహ్మంబొక్క డటంచు కీర్తనల తత్త్వంబింపుగా బాడె
నిర్జిహ్మ స్వాంతుడు నన్నమయ్య భళిరా! జేజేల కీర్తింపరే!
బ్రహ్మజ్ఞానము నందుకోగ ప్రజలున్ రంజిల్లి బ్రహ్మాత్ములై
బ్రహ్మంబేనను జ్ఞానవంతులగుచున్ వర్తిల్లగా గోరుచున్

చం. నరహరి కీర్తనావళుల నానిన జిహ్వకు నన్య సన్నుతుల్
కరము రుచింప నేరవని ఖండన జేసెను రాజ కాంక్ష నిం
పరయగ భక్తి గానమదె ప్రాణము నాకని తెల్పినాడహో
స్థిర తరు డైన వైష్ణవుడు దివ్యుడు ధీరుడు నన్నమయ్యయే!

మ. తెలుగుంబల్కుల తేటి గీతివలె ప్రీతిం గొల్పు సంకీర్తనల్
పలు వేలన్ రచియించి పాడితివిగా పద్మాక్షు లీలాగతుల్!
పొలుపౌ చూపుల పెండ్లికూతు నటనామోదంపు శబ్దంబులన్
పులకింతల్ పొదమంగ పాడితివిగా పుణ్యాత్మ! నీకేతగున్!

 

## శ్రీమతి మల్లిమణుగుల ప్రసూనాంబ

రాయ్‌ఘర్, (9755111876)

పం.బా. తెలుగు పదముల స్వర జతుల తేనెలూరు గళమునన్
నిలిచె మధువిడు పలుకులు గ నేలనేలె స్థిరముగన్
వెలుగు జిలుగులు కురియున రవిందమాలలుగ దమిన్
కొలిచెను తిరుమల కొలువును కోర్కెలేకయెనతడున్
(పంచబాణ వృత్తము (న,న,న,న, ర,న, లగ) 1- 13యతి)

తే. గీ. నందకాంశ సంభూతుండు నంద వంశ
సూరి లక్కమాంబలనింట శోభ తోడ
నవతరించెగ నన్నమయ్య తను వేల
కీర్తనలు వ్రాసి నర్పించె కేశవునికి

తే.గీ. తెలుగు సంస్కృత భాషల తేని యలను
కలగలిపి భక్తి, లాలి, శృంగార గాన
మాధురి నిపంచి, తరియించె మధుర కవిగ
అమరు డై స్థిరముగ నిల్చె నన్న మయ్య

కో॰న. విష్ణు కృపాణము పృథ్వికి కవిగా
వైష్ణవ వంశపు పండిత సుతగా
గేష్ణువు,భక్తుడు, కృష్టిపద సుధీ
నిష్ణుడు నన్నిట నిక్కము కనగన్
(కోకనదము : భ,భ,భ,స (1-7యతి))

 

## శ్రీమతి పర్వతనేని శ్రీసత్య

చికాగో, అమెరికా(01 (630) 747-6447)

తే.గీ. బాలుడయ్యు తలంచెను వాసుదేవ
నామము సతమ్ము మదిలోన నరహరియని
పావనమయమీతని భక్తి పదకవితయె
ఆది సంకీర్తనాచార్య అన్నమయ్య

ఆ.వె. తేనెలోన ముంచి తీసెనేమొ పదమ్ము
పదము తీపిదనము పంచి ప్రజల
పరవశులను జేసి భక్తి బీజములేసె
హరికి దాసుడైన అన్నమయ్య

తే.గీ. హరిసంకీర్తనాచార్య అన్నమయ్య
నందకాంశ సంభూతుడానంద నిలయ
వాసి శ్రీనివాసుని కొల్చె పదకవితల
భక్తి శృంగారములుపొంగ ముక్తి నీయు
కీర్తనల తోడ, భక్తులకివె వరములు

ఉ. వేంకటనాథుకున్నితడె ప్రేయసియై ప్రణయాబ్ధి తేల్చెనా
పంకజనాభుకున్ పరమ భక్తిగ పూజలు చేసె దాసుడై
సంకటహారునిన్ పిలిచె సంకెల బంధములూడదీయగన్
శంకర వందితున్ కొలిచి స్వాంతమునందున నిల్పె శాంతితో



# కాశిరాజు లక్ష్మీనారాయణ

విజయవాడ (9494769293)

చం. తిరమగు తాళ్ళపాక ఘన తీర్థమునందున రాజహంసగా
వరమున నామతిల్లి జనవంద్యు కఠారము నందకమ్మహా
స్వరధుని వోలె భక్తిరసవాహినియై ప్రవహించి దివ్య భూ
ధరు చరణారవిందరజ తానవమంది తరించె నెంతయున్

ఉ. స్వరపద కోశముల్చిఋతప్రాయము నందున నోరబట్టి న
ట్లొరిమగ రాగతాళములకూపిరియౌ పదబంధమొప్పగన్
విరివిగ శేషశైలవిభు పెంపు జగంబున విస్తరింపగన్
తరిగొని గీతగానమున తన్మయుడై వెలుగొందె నాద్యుడై

చం. కలియుగమందు మానవులు కష్టసముద్రనిమగ్నులై బయల్
వెలువడు దారికానక తపించెడి వారికి ధైర్యమూన పా
టలతెరచాప గట్టియు చిటారపు నాదట యోడపైన నా
జలరుహనాభు పాదముల సన్నిధి చేర్చగ దారిసూపెడిన్

చం. పదపడి వేంకటేశ్వరుని పాదసుమాల మరందమాధురిన్
హ్లాదమున మానవాళి హృదయంబులు సొక్కగ జానుతెన్గులో
పదములకద్ది కీర్తనలు పాడి తరించెను విష్ణుభక్తితో
పదకవితా పితామహుడు పావను డన్నమయార్యుడెన్నగన్





## ఊర ఈశ్వర్ రెడ్డి

వడ్డేపల్లి మం. గద్వాల (7981497017)

ఉ. భక్తుడు నన్నమయ్య భవబంధములున్ హరియించుదారినా
సక్తులజేయనెంచి హరిస న్నిధిజేరగమోక్షచింతనా
రక్తులజేసిమున్నడచి రాగసుధారసభక్తిగ్రోలి తా
ముక్తినిపొందుమార్గమునుముద్దుగదెల్పెను మానవాళికిన్!

ఉ. నవవిధభక్తులందు హరినామమునే స్మరణమ్మమేలటన్
భవభయబంధముల్ దొలగి పావనమౌహరిజేరుమార్గమున్
సవినయరీతిగా జగతి చాటెను కీర్తనలెన్నియోయిలన్
ప్రవిమలభక్తితోడప్రతి వందనముల్ శతమన్నమయ్యకున్!

ఉ. దైవము రూపమై వెలసె ధారుణియందున ధర్మమున్నదా
కావగనెంచివ్రాసెహరి గానకథామృత నామకీర్తనల్
చేవనొసంగి భక్తిరస జీవముసాగరమౌచు పొంగగా
పావనులౌటతథ్యమనె భావితరాలకు మార్గదర్శియై!

మ. తెలిపెన్ బ్రహ్మమునొక్కడేయనుచు సందేహంబులేకింతయున్
దెలిపెన్నీభువి పంచభూతములకేదీభేదమే లేదటన్
దెలిపెన్నీభువిజంతుజాలమునకేదీవైరమేలేదటన్
దెలిపెన్నీభువిరాజుబ్రాహ్మణులకేదీజూడ చండాలురన్
కలయన్ జూడగ బ్రహ్మ రూపమనితా గానంబునేజేయుచున్!



## శ్రీమతి కుసుమ ఉప్పలపాటి

హైదరాబాద్, (9705009254)

1) మానినీ. తీరుగ వేంకట దేవుని కీర్తన తెన్గున వ్రాసిన ధీమతివే!
భారము నీదని భక్తిని గొల్చెడి పాటలు వేలుగ వ్రాసితివే!
కోరక నే నిధి గొల్చితివే హరి, కోవెల జేయుచు గుండియనే!
చేరగ నెల్లరు శ్రీహరి సన్నిధి చేసెను నీ కృతి చేరువగన్!

సీ. బ్రహ్మ కడిగినట్టి పద మహిమలు దెల్పి,
బ్రహ్మ మొక్కటనిన బ్రహ్మ వేత్త!
వేంకటేశుని మంత్ర వేద మహిమ దెల్పి,
ముక్తి మార్గము నిల్పె భక్త వరుడ !
నానాటి బ్రతుకొక నాటకంబని దెల్పి,
వైరాగ్య కృతులల్లు భవ్య సుకవి!
జో యచ్యుతానంద జోజో ముకుందంచు,
గానమ్ము సల్పిన గాయకుండ!

తే.గీ. భక్తి, శృంగార, వైరాగ్య భావములను,
కృతుల రచియించితివి స్వామి కృపను బొంద!
తాళ్ళపాక వంశంబెల్ల ధన్యత గొన,
"అన్నమయ్య" గా తెలుగింట నలరినావు!

ఉ. చోద్యము గాదె వ్రాయగను సొంపగు పాటలు వేలు,వేలు! నై
వేద్యము జేయుచున్ బ్రతుకు, విష్ణువు గొల్చుచు భక్తితో సదా
సేద్యము చేయగన్ మదిని – శ్రీహరి కీర్తన లుద్భవించె! నీ
వాద్యుడవే తెనుంగు కృతు లర్చన జేయగ శ్రీనివాసునిన్!



# కొనింటి రమేష్

హైద్రాబాద్ (9247 160829)

చం. పద కవితా పితామహ! అపార పదాలు రచించి తీవునీ
మది నిరతమ్ముకొల్చె నొక దీక్షగ కీర్తనలల్లి పాడి నీ
హృదయమునిండ భక్తినిడి హేతిధరున్ ప్రియమార నెప్పుడున్
పదిలము జేసినన్నమయవయ్యవతార విలాసి ఖడ్గమా

ఉ. ముప్పది రెండువేల పదముల్మన సొప్పగ కూర్చి నావయా
గుప్పెడు గుండెలో హరికి గూడును గట్టియుపూజ చేసి మీ
రెప్పుడు తంబురందు సవరించిన తీగల మీటుచున్ సదా
తప్పక దైవ సేవలను ధన్యుడవైతివి భక్తితోడుగన్

ఉ. పోయెను కోయ పచ్చికను పోయెమనస్సటు వేంకటేశుపై
పోయెను గుంపు వెంట తను పోయెను శ్రీహరి యింటికిన్ కృపన్
గాయము చేతి కైనదియు కానక దేవుని కాంచినంతనే
మాయమునయ్యె బాధలవి మాధవసేవను మానిపోయెనే

ఉ. వేంకటరాయునెప్పుడును వేడుచుపాడుచు వేకువందునన్
పంకజ నాభునిన్ నిదుర , పాటల లేపుచు నిత్యపూజలన్
కింకరు నంచుతా సలుపు కేశవమూర్తిని నిద్ర బుచ్చుచున్
లొంకన వెన్నునిన్ కొలిచె లోకము మెచ్చగ నన్నమయ్య తాన్



# శింగరాజు ప్రసాదరావు

నెల్లూరు (91008 75978)

సీ. వేదశాస్త్ర పురాణ విజ్ఞాన సారమ్ము
నీదు కీర్తనలందు నిభృతమయ్యె
ములకనాటి తెలుగు కలికితనమ్మెల్ల
నీపద కవితల నిండి పొరలె
జానపదులు పల్కు జాతీయసూక్తులు
నీ పాటలందు జీర్ణించి పోయె
ద్వాదశ సూరుల ద్రవిడ ప్రబంధ ధీ
నీదు సంస్తుతులందు పాదుకొనియె

తే.గీ. ఒందు రెండొకో! ముప్పదిరెండు వేల
పదము లమలభక్తిరస ద్యునదము లాంధ్ర
గేహముల ప్రవహించి సుకృతుల చేసె
ఆంధ్రజన పుణ్యశేవధీ!అన్నమయ్య!

సీ. పాటించినాడవు పల్కుపల్కున విష్ణు
భక్తిపారమ్య భావనల సృష్టి
మోటించినావు వేల్పులనెవ్వరిని గాని
ఏడుకొండలకు మంగేశ్వరులని
చాటించినాడవు సర్వజనులకు దిక్కు
వేంకనే-లేరింక వేరె యనుచు
దాటించినాడవు దారుణ భవవార్ధి
హరిభక్తి తరణుల నాంధ్రజనుల




తే.గీ. ఐదువందలయేండ్ల ముందాంధ్ర ధరణి
తాళ్ళపాక పల్లియ మధుదైత్యదమను
నందకాంశమ్మున జనించినావె
ఆంధ్రజన సుకృతమౌచు అన్నమాచార్య! నీవు.

సీ. తెలుగు బాసను తొట్టతొలిగ వెలసినట్టి
వాగ్గేయ కారుడన్ ప్రథనుబడసి
సర్వ భక్తాళికి శ్రవణరక్తి ఘటించి
సంకీర్తనాచార్య సంజ్ఞ నొంది
అలమేలుమంగమ్మ అభిదతో శతకమ్ము
వేంకనపై వ్రాసి వినుతిగాంచి
మెప్పుగాశ్రీహరికొప్పుగా ముప్పది
రెండు వేల పదాల కృతము మోచి
తే.గీ. తెలుగునేలల నెల్లెడ తిరిగి తిరిగి
నారదుండొ?తుంబురుడో యనంగ జనులు
తనివి నొందించితివి వేల్పు తండములను
త్వద్రచిత కీర్తనామృత వారిధార

చం. పదకవితాపితామహుని పాత్రకు పాత్రుడవీవెగాదె! ము
ప్పదిపయి రెండువేల రసవత్పదముల్ కయిగట్టి వేంకటే
శుదయకునౌరసుండను యశోధనుడైతివి అన్నమయ్య! నీ
పదములె యెప్డు పాడెదరు పాయక దక్షిణదేశ గాయకుల్.



## చి.విష్ణుభొట్ల కార్తీక్ (10వ తరగతి)

హైదరాబాద్ (94419 29535)

ఆ.వె. చిరుత ప్రాయ మందె శ్రీధరుని గొలిచి.
విద్య నభ్య సించె వినతి తోడ.
శ్రీహరిని నుతించి శిరమందు గైకొని.
పరమ పదము వైపు పథము జూపె.

మానిని. వేంకట నాథుని గొల్చిన చాలిక వేదన లన్నియు తీరును లే.
పంకజ నాభుని కీర్తన పాడిన పంకము లన్నియు పోవును లే.
శంకలు వీడుచు గట్టిగ పట్టిన చాలును శ్రీహరి పాదములన్
సంకట మెప్పుడు రాదని చెప్పెను శాశ్వత కీర్తన లన్నమయే.

ఆ.వె. లక్క మాంబ సుతుడు లక్ష్మీశు కృపతోడ.
గర్భ మందు నెంతొ కాంతి తోడ.
నంద కాంశ మందు నవనీతముగ పుట్టె.
కృతుల నెన్నొ వ్రాసి కీర్తి పొందె.

ఆ.వె. పద్మ నాభు గొల్చి భక్తికృతులు పాడి.
బ్రహ్మ మొక్కటియని పలికె నతడు.
ప్రజల హృదయ మందు భక్తిమార్గము నాటి.
అమరు డయ్యె సుకవిఅన్న మయ్య





## శ్రీమతి కస్తూరి మోచర్ల

హైదరాబాద్ (9866188618)

చం. కలియుగ దైవ మాహరిని కాంచుచు నిత్యము కీర్తనమ్ములన్
లలిత పదంపు గుంఫనల ప్రాభవమొప్పుచు రంజకమ్ముగన్
పలు వెలయించి పామరులు పండితు లొప్పిదమైన తీరుగన్
వెలిగెను నందకాంశజుడు విన్నపముల్ వినిపించుచున్ భువిన్

చం. నవవిధ భక్తి మార్గముల నాణెముగన్ రచియించి వేనవే
ల విరహ భక్తి మార్గ మధురంబగు కీర్తనలన్ని వేంకటే
శ విభునిపైన తా నడచి జ్ఞాన పథమ్మున నన్నమయ్యయున్
వివిధములైన ప్రస్తుతుల వేంకట నాథుని కొల్చె నిత్యమున్

ఉ. చిన్నతనంబు నుండి హరి చింతన జేయుచు భక్తి మెండుగా
నెన్నియొ కీర్తనమ్ము లను నింపుగ వ్రాసిన వైష్ణ వంశజుం
డన్నయ వాగ్మి శ్రీహరి శ్రయంబును నిత్యము పొంది దివ్యమౌ
నున్నత పీఠమీ ధరణి నొంది తరించెను కీర్తిమంతుడై

మ. పదహారేళ్ళకు స్వామి యాజ్ఞకును తా బద్ధుండునై యెన్నియో
పదతాళమ్ముల కాలవాలముగ శ్రావ్యంబౌ సుగీతంబులన్
ముదమారంగను వ్రాసి రోజు కొకటిన్ మోదంపు తాదాత్మ్యతన్
పద పద్మంబుల బెట్టె నన్నమయ పెంపారంగ వెంకన్నకున్

 

## పిన్నలి వేంకటరామ గోపీనాథ్

బెంగళూరు (93971 77001)

ఆ.వె. శ్రీనివాసు దలచి చిత్తమ్మె యలరంగ
వేల కీర్తనలను వెలగ జేసె
అన్నమయ్యె మనకు నధ్యాత్మికాహార
మందజేసె గాదె యాదటగను

తే.గీ. 'బ్రహ్మమొక్కటే' యని పల్కె, పరిగణించ
అన్నమే పరబ్రహ్మమ్ము మిన్న యదియె
ఎవరికైన నెంచగ నద్దె యెవరితరము
అన్నమయ్యకే సాధ్యమౌనట్లు పలుక

ఉ. ఆకలి గొన్నవారికిల నార్తిని బాపగ వేంకటేశుడే
కేకలు వేయు నాస్తికపు కేళియు నాపగ నందకమ్ముతో
దూకెను, పృథ్విచేరగనె త్రోసెనె యక్షర రమ్య భుక్తమున్
ఆకలి తీరదే ప్రజకు నక్షర భక్ష్యములెన్ని సేసినన్

మ.కో. అన్నమయ్యన నన్న యమ్మయు నయ్యసైతము బల్కరే
మిన్నగా మరి దైవభక్తుల మేలిమార్గము నాతడే
కన్నతల్లిగ జోలపాడెను కాద తండ్రియె భుక్తికిన్
అన్నగా తనె యాదరించుచు నక్షరమ్ములు నేర్పెగా/చూపెగా

 

## శ్రీమతి ఎస్.మాధురీదేవి

హైదరాబాద్ (99639 98955)

చం. పదకవితాపితామహుడు ప్రస్తుతిజేసెనుదేవదేవునిన్
సదమలమూర్తి రూపమును చక్కగదల్చెడి భాగ్య మీయగన్
ముదమును బంచు కీర్తనలు మోహనురూపు ని పైన గూర్చెతా
పదిలము సేయరే జనుల పాడరె వానిని భక్తి తో వెసన్

తురగవల్గన రగడ.
వెన్న దొంగ పైన వ్రాసె వేల కొలది కీర్తనాళి
నన్న పానములను మరచి యన్నమయ్య సతము మనసు
సన్నుతించునట్లు చేసె జలజ నయనుని హరినియని
పిన్న వయసు నందె నందె పెక్కు ఖ్యాతి! చక్కగాను

ఉత్సాహము.
తెలుగుభాష లోనిపాట తేనెలూరు విధముగా
పలికె నన్నమయ్య సతము భక్తి మదిని నిండగా
వెలుగు రేఖయై నిలబడి విన్నపాలు జేసెగా
కలియుగంబు నందు జనుల కామితముల దీర్పగన్

ఆ.వె. ధన్య చరితుడితడు తాళ్ళపాక సుతుండు
హరిని వినుతి జేసి హర్షమిచ్చె
జనులకెల్ల పంకజాసనుని ఘనత
దెల్పి మాయ పొరలు దీసె నతడు



ఆ.వె. కొండల నెలవైన కోనేటి రాయడు
వరము లొసగుటందు వరదుడాత
డెంచి చూడ సతము నీతడే దైవమ్ము
మంచి వాడు ఘనుడు మహిని నిజము





## అల్వాల లక్ష్మణ మూర్తి

కలువకుర్తి (9550467431)

ఉ. కొండల రాయడా యనుచు కూరిమి పిల్చిన తక్షణంబుగాన్
అండన జేరినాడటగ యన్నమయా యని యాదరించుచున్
పండుగె గీతముల్ వినుట పావనమూర్తికి పద్మ తోడుగన్
నిండెను భక్తిభావములు నిత్యము లయ్యెను నీదు సత్కృతుల్.

ఉ. పాడితివయ్య జోలలను బాలుని నిద్రకు పుచ్చినట్లుగన్
వేడితివయ్య ముక్తికయి విశ్వము లేలెడి వాని నార్తిగా
కూడితివయ్య భక్తజన గోష్ఠిని పుష్టము చేయునట్లుగాన్
ఆడితివయ్య శ్రీధరుని నందగ నీపద కీర్తనాళిచే.

మ. కలగన్నానని కన్నులారగను లోకాధీశునిన్ చూడగన్
అలవోకన్ రచియించి పాడుచును ఆధ్యాత్మికోద్గీతముల్
పలుకుల్ జోలలు కీర్తనల్ పదములున్ ప్రార్థించగా శ్రీహరిన్
ఒలికెన్ భక్తిరసంబు పుష్కలముగాన్ నుత్సిక్తమౌ నార్యుడా!
(ఉత్సిక్తము –అతిశయించి, ప్రోక్షణము)

ఉ. గోపన వంటి వారికిని గుట్టును దెల్పుచు మార్గదర్శివై
పాపపు రాశినిం దొలుచు భక్తి జగమ్మును చూపినాడవే
తేపకు తేపకున్ దలచి దేహపు భ్రాంతిని విస్మరించుచున్
శ్రీపతి పాదపంకజము చిత్తము నిల్పితివయ్య ధీవరా!

 

## రాజేశ్వర శర్మ మల్యూకాచి

మహబూబ్ నగర్ (8019597939)

ఉ. శ్రీహరి నందకాంశజుడు శ్రీ విభు లీలల గానకుండగన్
దైహిక కార్యముల్ సలుప దాపము నొందు నరాధముండుగ
స్నేహము దాహమున్ సఖుడు నిక్కలి దైవము వేంకటేశుడన్
సోహము పల్లవించి భవ శోకము దాటెను భాగ్యవంతుడై

ఉ. భావము నందునన్ మరియు బాహ్యము నందున సంతసమ్ముగన్
దేవుని వేంకటేశ్వరుని దీక్షగ గొల్చెను రాగదీప్తితో
జీవిత మంతయున్ బలు సజీవములైన సరాగమాలికల్
భావరసాత్మ దృష్టినిడి భక్తిగ నిల్పెను దెల్గువారికిన్

చం. తెలుగుపదాల నింపులను దీయని రాగ సుధారసంబులన్
గలుపుకు చక్కనైన గమకంబుల జేర్చుకు గీర్తనావళిన్
జెలువున గూర్చ, నాడు భువిసీమను త్యాగయ, రామదాసులే
పొలుపుగ సాగిరన్నమయ పోయిన దారిని ధన్యజీవులై

ఉ. పల్లియ లోన పాడుకొను పాటల పద్ధతి నూతగాను దా
నల్లెను మల్లెమాలలుగ నందముగా జన గేయముల్, విరా
జిల్లగ జేసె జాజర విశేష పదాల సునాద గేయముల్
ఫుల్లమునొందు మానసము  పుణ్యచరిత్రుని దల్చినంతనే

 

# మాతా శాంకరీ దేవి

తిరుమల (7981338902)

చం. ఘనుడగు దండ్రి ,దల్లియు సుగాయని రక్తిగ కొల్చు శ్రీ పతిన్
మనమున బుట్టె శోకము కుమారునికై కదు మ్రొక్కి వేడగన్
కనికరమొంది హస్తమున ఖడ్గము దానిడె మోదమందగన్
జననము నొందెనందనుడు సాధకుడౌ భజియింపగా హరిన్

ఉ. నందవరీకుడింట జననంబయి కీర్తన లొజ్జయై ధరన్
నందక మంశగా హరిని నాద సుకీర్తన లల్లి భక్తితో
నందముగా పదంబుల నమర్చి సుశబ్దపురీతు లన్ మహా
నందపు పారవశ్యమున నందకుమారుని ప్రస్తుతించెనే

చం. తెలుగున గొబ్బి ,లాలి లను తేనెల భక్తిరసంబు గీతముల్
తలచుచు వేంకటేశుని సదా మదియందు నపారభక్తిగన్
పలుకగ శ్రీనివాస ఘన వైభవ మెల్లను వేనవేలుగా
చెలువముగా రచించి కడుజిన్నెలు కూర్పగ సన్నుతింపగన్

ఉ. వృష్టిగ సంప్రదాయముల వృద్ధగు రీతిని కీర్తనంబులన్
ఇష్టిగ నిత్యమొక్కటిగ నింపుగ శ్రీ హరికిన్ స్తుతించగా
నిష్ఠగ వైష్ణవాగముల నేర్చిన శిష్టుడు నన్నమయ్యయే
శ్రేష్టునిగా క్షితిన్ వెలిగి శ్రీ హరి జెంతకు జేరె నత్తరిన్



## శ్రీమతి కే. వరలక్ష్మి

విశాఖపట్నం, (9440197990)

ఉ. పండిత వంశమందు ప్రభవంబును బొందిన యన్నమయ్య యా
కొండల రాయపై మిగుల కూరిమి తోడుత నేడుకొండలన్
కొండొక భక్త బృందమట గొండను నెక్కుచు భక్తిభావనన్
దండెలు మీటుచున్ జనగ దానును నెక్కెను సప్తశైలముల్

మ. పదునారేండ్ల వయస్సులో హరిని, శ్రీవత్సాంకితున్ గన్నటుల్
హృదిలో స్వాదన కల్గ నన్నమయ తా హృద్యంబునౌ కీర్తనల్
హృదయాళుండగు వేంకటేశ్వరునికిన్ హృత్పద్మ మర్పించుచున్
ముదమొప్పంగ రచింప సాగెనిక సంపూర్ణంబునౌ భక్తితో

చం. పదకవితా పితామహుడు, వైష్ణవ భక్తుడు తెన్గుసాహితిన్
ముదముగ వ్రాసె నన్నమయ ముప్పది రెండగు వేల పాటలన్
పదనుగ జోల పాటలను బన్నుగ దుమ్మెద గొబ్బి పాటలన్
హృదయము హర్షమంద రచియించెను దెల్గుల భాగ్యవృద్ధిచే

మ.కో. నందకాంశజు డన్నమయ్యయె నారసింహు నుతించుచున్
సుందరుండగు వేంకటేశుని శోభలొల్కెడు వేల్పులన్
వందనీయుల వారిపైనను వ్రాసెనెన్నియొ కీర్తనల్
వందనీయము తాళ్ళపాక సువంశమయ్యది నిత్యమున్





## శ్రీమతి ఓలేటి స్వరాజ్యలక్ష్మి

వడోదర, గుజరాత్ (8688754393)

సీ. అల్లదే కైవశంబగు దివ్యకైవల్య
పథమని కీర్తనల్ పాడిచూపె
కొండల నెలకొన్న కోనేటి రాయడు
కోరిన వరముల కూర్చు వాడు
భావము లోనను బాహ్యమ్ము నందున
గోవింద యనుచును గొంతునెత్తి
పాడరె జనులంత భక్తి గా నిలను
కొండలరాయని కోర్కె మీర.

తే.గీ. బ్రహ్మ మొక్కటె సకలమ్ము భ్రమ యటంచు
మూఢ మతులకు జ్ఞానమ్ము బోధచేసె
చక్క శృంగారగీతముల్ జావళీలు
వేద విజ్ఞాన కథలెన్నొ విధిగ పాడె.

తే.గీ. సాళ్వ భూపతి చరితన సాధ్యమనుచు
నరుల పొగడుట కవులకు నరకమనుచు
శిక్ష ననుభవించగ కవి సిద్ధమయ్యె
నృపుని మనసును మార్చె వినీత బుద్ధి

ఆ. వె. కామ క్రోధములవి కానని వైరులు
పీల్చి పిప్పి సేయు కాల్చు తనువు



మోహ బంధములవి  మోక్షమ్ము నీయవు
ప్రేమ యొకటె యన్న వేల్పు నీవె

ఆ. వె.  నాటి సంఘ కులపు నడ్డు గోడలు చీల్చె
మంచి  భావ ములను మనసు  నింపె
జాతి వైర భేద జాడ్యమ్ము పోగొట్టి
అలసి సొలసి పోయె అన్న మయ్య.




## క్రొవ్విడి వెంకట రాజారావు

హైదరాబాద్ (9553424499)

మ. ఎదలో వేంకటనాథు భక్తి విరియనెన్నెన్నొ సంకీర్తనల్
ముదమారన్ విరచించి శౌరికి మహామోదమ్ముగా గూర్చెనే
సదసత్స్ఫూర్తిడి యన్నమయ్య జగతిన్ సంకీర్తనాచార్యుడై
యెదిగెన్ నాంధ్రుల పుణ్యరాశిగను తానెంతో మహెూపజ్ఞతో.

చం. ఒరవుగ విష్ణు దేవత లహెూబిలమున్ గల నారసింహునిన్
తిరుమల వేంకటేశ్వరుని దివ్యపు లీలల సంస్తుతించుచున్
విరివిని వేలు వేలుగను వీనుల విందగు భక్తి గీతముల్
పురవుగ వ్రాసి యన్నమయ పూజ్యతనొందెను ధారుణీస్థలిన్. జి

మ. పదముల్ పాటలు పద్యముల్ విరివిగా వ్యాపింపగా జేసియున్
చదురౌ భక్తినిగూడు వాఙ్మయమునన్ సంగీత శృంగారముల్
మృదువై యుండెడి భావముల్ జొనిపి తా మెల్పైన చందమ్ముగా
కుదురున్ గొల్పియు నన్నమయ్య వెలిగెన్ కోనేటిరాయేచ్ఛచేన్.

ఉ. వేంకటనాథు రూపముగ విష్ణువు ఖడ్గము నందకమ్ముగా
పంకజనాభు కోవెలను భక్తులు మ్రోచెడు గంట రూపునన్
అంకిత భక్తి నన్నమయ నందరు నెంతురు వైష్ణవోత్తముల్
సంకటహారి కేశవుని సన్నుతి జేసిన సత్కవీశ్వరున్.



## క్రొవ్విడి వెంకట సుబ్బలక్ష్మి

హైదరాబాద్ (9553424499)

మ.కో. సొంపు గూర్చెడి భాష యందున శోభనిచ్చెడి కీర్తనల్
పొంపుగా పలు గీతముల్ పరిపూర్ణమౌ పదగుంఫనన్
ఇంపు హెచ్చగు తీరునన్ వెలయించి వేంకటనాథునిన్
పెంపు జేయుచు అన్నమయ్యయె వెల్గె నెంతయు భక్తితో.

తే.గీ. విష్ణు కీర్తన ప్రతిరోజు విధిగ జేసి
పదకవి పితామహుండను ప్రఖ్య నొంది
అచ్యుతుని పాదముల నంది అన్నమయ్య
శాశ్వతమ్మగు సత్కీర్తి జగతి నందె

మ.కో. అన్నమయ్య పదమ్ము లన్నియు నాంధ్ర సంస్కృతి జూపుచున్
సన్నుతిన్ గల జావళీలుగ చౌకలించుచు నెల్లెడన్
పన్నునొందిన గొబ్బి తుమ్మెద పాటలయ్యెను జూడగా
చెన్నుగా జనతాళి నోళుల జీరువారుచు నుండెనే!

ఆ.వె. త్యాగరాజు రామదాసు క్షేత్రయ్యకున్
పదము లల్లుటందు ప్రతిగ నిలచి
గేయ వాఙ్మయమున కీర్తితో వారలు
నడరు నట్లు చేసె నన్నమయ్య.





## స్వయంవరపు అప్పారావు

పెందుర్తి- విశాఖపట్నం (7780687717)

ఉ. కంటిని వేంకటేశ్వరుని కన్నులపండువు గాగ నేడు నా
పంటయె పండెనే యనుచు పాటలు పాడడె యన్నమయ్య నీ
వంటి విభుండు లేడుధర పంకజనాభ సురేంద్రవంద్య మా
యింటికి రార మాధవ త్రయీ భువనాధిప యంచునిష్ఠతోన్.

చం. కలియుగమందుమానవులకాంక్షలు దీర్చెడుదైవమీతడే
పలుగతులైన బాధలొకపట్టున గూల్చునువేంకటేశుడే
యిలవెలుగొందుదేవుడని యీతనికీర్తనలెన్నొవ్రాసి తా
వెలుగునుబొందె నన్నమయ విశ్వము నందున విజ్ఞుడై దగన్

మ. అదిగో శ్రీహరి వాసమల్లదియె తానాకాశమార్గమ్మునం
దదిగో చూడుడు మ్రొక్కు డాతని నటన్ హర్షంబునన్ జీవులన్
సదయుండౌచును నిల్చిగాచు ధరణిన్ సత్యస్వరూపుండు ధీ
ప్రదు డాతండని వేంకటాద్రినిలయు న్ప్రార్థించెనిత్యమ్ము తాన్.

చం. కలియుగమందుమానవులుకాంచగజాలరుదైవమున్ సదా
పలుగతులైన భావగుణ పాశములందునజిక్కియుందురీ
తులువలటంచుదామదిని దల్చియువేంకటనాథునామమున్
దలచిన వచ్చు ముక్తియని తానురచించెనుకీర్తనాదులన్

కం. వ్రాసెను కీర్తన లెన్నో
భాసిల్లుచునన్నమయ్య పదకవి యైతా
తోషము నొందెను జలనిధి
వాసునిపై కయితలల్లి బయిసిన్ బొందెన్



# కర్నాటి రఘురాములు గౌడ్

గుండ్లగుంటపల్లి, (9490911645)

ఆ.వె. అన్నమయ్య కున్న ఆదర్శమగుభక్తి
నందజేసి మోక్ష మంద నిమ్మ
యెల్లవేళ వ్రాయ నెనలేని కీర్తనల్
వేంకటేశ నిన్ను వేడుకొందు.

ఉ. దాసుడనయ్యి శ్రీపతికి తా వినిపించెను క్రొత్తగీతముల్
వాసిగ అన్నమయ్య తన వంశ యశస్సును నిల్పె నిట్టులన్
వ్యాస మునీంద్రునింట తన వారసుడౌ శుకయోగితీరుగన్
భాసుర దివ్య మాలికల భక్తి జగమ్మును నేలె నిద్ధరిన్

ఆ.వె. అన్నమయ్య తీరు హరినామ కీర్తనల్
చదువనిమ్ము వ్రాసి యెదుగనిమ్ము
జయమొసంగుమయ్య జగమేలు తలిదండ్రి
శరణు వేంకటేశ శరణు శరణు!

సీ. శ్రీనివాసుడు మెచ్చు శృంగార కీర్తనల్
రచియించె పలువిధ రాగములుగ
సంగీత సాహిత్య సార్వభౌముడునయ్యె
తల్లి దండ్రుల మించె తనయుడిట్లు
ముదమొప్ప పదములు ముప్పది రెండు వే
లను వ్రాసె సద్భక్తవరులు మెచ్చ



భక్తి వరుల కెల్ల భజన జేయగ జేసె
ముందు తరాలకు ముక్తి జూపె

తే.గీ. అన్నమయ్యను మదిలోన అభినుతింతు
నాశలెల్లను వీడినే ననుసరింతు
దాస దాసుండ రఘురామ దాసునయ్య!
ఆలపింతు సదా అన్నమయ్యపాట!



## తురిమెళ్ళ రాధాకృష్ణ మూర్తి

శాంతినగర్, గద్వాల (9966319792)

సీ. మా. నగధరు ఖడ్గంబు నందక మిలలోన
అన్నమయ్యను పేరనవతరించె
పదముల కాద్యుడై పాటలు పద్యాలు
రచియించి కీర్తించె లక్ష్మి ధవుని
వైష్ణవ విభవంబు వసుధను చాటగా
వ్యవహార భాషలో పదములల్లె
సంగీత శృంగార సాహిత్య భావాల
పదములందునజెప్పె భవ్య గుణుడు
ఆచంద్ర తారార్కమవనిపై వెలుగొందు
నన్నమయ్యాకీర్తి చెన్ను మెరయ

తే.గీ. తండ్రి నారాయణాఖ్యుండు, తల్లి లక్క
మాంబ, గారాల పట్టియై మహిని వెలిగె
వ్రాసె ముప్పది రెండువేల పదములను
అలతి పదముల నందంబు లొలుకు చుండ

తే.గీ. అరయ సంకీర్తనాచార్యు డనఘు డితడు
విశ్వ మంతయు చాటెను విష్ణు మహిమ
ధార్మి కోత్తము డీతండు దార్శనికుడు
ఆమరుడాయెను ధాత్రిలో నన్నమయ్య.





శ్రీహరి భావనల్ సతము చిత్తము నందున నిల్పుచున్ మహో
మోహము లెల్లద్రుంచి, మరి మోహన కృష్ణుని లీల బాడుచున్
పాహిమురారియంచు మది పాయక గొల్చుచు దేవదేవునిన్
పాహియటంచు వేడె పరమాద్భుత విష్ణుపదస్థ లోకమున్



# కానుకొలను లక్ష్మీ సీత

హైదరాబాద్ (9866953582)

 మ.కో. విన్నపాలను విన్నవించుచు వేంకటేశ్వరు సన్నిధిన్
నన్నమయ్యగ భక్తిగొల్చుచు నంతులేని ముదమ్ముతో
వెన్నముద్దలు దిన్న వానికి వేడుకైన సుకీర్తనల్
వన్నెకెక్కుచు నేడుకొండల వాని వైభవమంతటన్!

చం. పదకవితాపితా మహుడు భాగ్యవశమ్మున సన్నుతింపగన్
బదకవితావిధమ్ములను భావితరంబుల వారికాద్యుడై
ముదముగ నన్నమయ్యగని ముచ్చట నొందుచు వేంకటేశ్వరున్
బదములపైన వ్రాలుచును భక్తిగ వ్రాసె సుకీర్తనమ్ములన్

కం. వేడుక నిచ్చెడి జన్మము
నీడను బొందుచు దిరుమల నిశ్చల మందున్
వీడక నన్నయ స్వామికి
బాడగ కృతులుగ జగమున వన్నియ కెక్కెన్!

తే.గీ. తిరుమలందు నన్నయగురు దిక్కులను ది
రుగుచు వేంకటేశ్వరుని కోరుచును దనరి
హరిని గోవింద యనిపిల్చి పరవశింప
తిరుమలగిరి వాసునిచెంత దేరు ముగితి





## ధర్మిశెట్టి రమణయ్య

మైదుకూరు, కడపజిల్లా (9704153892)

సీ. బ్రహ్మం బొకండని బడుగు వర్గాలకు
 నరయ జేసిన కవి వరుడు తాను
కోలాట భజనలు కొమరొప్ప రచియించి
 జాజర పదములన్ చాల వ్రాసి
భక్తి తత్త్వ మధుర వైరాగ్య సంబంధ
 గీతాలు వెలయించి జాతికిచ్చి
వేంకటేశ్వర పాద బిసరుహ పూజలన్
 ధన్యుడై మనినట్టి తాళ్ళపాక
ఆ.వె. అన్నమయ్య గురుని అఖిలాంధ్ర జనులెల్ల
అనుదినమ్ము చిత్త మందు దలచి
జిష్ణు పదమునందు చేరెడు మార్గమ్ము
చింత చేయు చుంద్రు చివరిదనుక.

సీ. లాలని బాలల జోలెల జోకొట్టు
 నవతార పురుషుడీ అన్నమయ్య
మధుర శృంగారమ్ము మైమరచి నుతింప
 నందల మెక్కెనీ అన్నమయ్య
భక్తి తత్త్వమమరు భావమ్ము వివరించు
 ఆగమ వినతుడీ అన్నమయ్య
శఠగోపుల కడ సత్సంప్రదాయము నేర్చి
 ఆచరించిన విప్రు డన్నమయ్య

## హరిసంకీర్తనాచార్య అన్నమయ్య



తే.గీ. గురువుతో బాటు శ్రీహరి కరుణ బడసి
శ్రీహరిని గూర్చి ముప్పది రెండు వేలు
కీర్తనలు వ్రాసి హరిలీల గీర్ణిచేసి
ఆంధ్రభాషకు సొబగిచ్చె నన్నమయ్య!

సీ. లక్కమాంబకు నోముల సుతుండు శ్రీహరి
నందక ప్రాభవ మందు వెలసె!
తండ్రి నారాయణు తపములు పండగా
తాళ్ళపాకను పల్లె తలుపుదట్టె
చదువు సంగీతాలు ముదమార తానేర్చి
తల్లిదండ్రుల కడ తత్త్వ మరసె
వేదాంత విజ్ఞాన వేత్తయై చెలువారె
పదకవితలయందునన్ బ్రహ్మ యయ్యె

ఆ.వె. మధుర రాగ వాణి మధువులు చల్లగా
పూజ్య భావములను పుడమి నెఱప
తెలుగు వారి కీర్తి తేటతెల్లము గాగ
అన్నమయ్య పదములలరె జగతి!

ఉ. ఎంతొ విదగ్ధతన్ తిరుమలేశుని గూరిచి కీర్తనావళుల్
సొంత రసార్ద్ర చిత్తమున వ్రాసి జనాళికి ముక్తిదక్కు భా
స్వంత పథమ్ము చూపిన విశాల హృదుండగు నన్నమయ్య నా
స్వాంతమునందు ముద్రవలె చక్కగ నిల్చె మనోజ్ఞ మూర్తియై!





## శ్రీమతి టి.వి.యెల్. గాయత్రి

పూణే. మహారాష్ట్ర (83907 05200)

చం. హరి కరవాలమీ భువికి హాళిగ వచ్చెను దివ్యతేజమై
స్థిరముగ నన్నమయ్యగను శ్రీగిరి యందున నిల్చె నాదమై
యిరవుగ పల్కె కీర్తనల నెంతయొ భక్తిగ శ్రీశులీలలన్
బరమపదంబు నిచ్చు నట పాడిన చాలును జన్మ ధన్యమౌ!

చం. పదకవితాపితామహుని పాట తెలుంగున కాదికీర్తనై
చెదరక నిల్చియుండెనిట శ్రీపతి సేవల తొల్లిగీతమై
పదముల జిల్కుతేనె తనివారగ గ్రోలుచు వేంకటేశుడే
ముదముగ విప్పి కన్నుగవ బ్రోచు జగంబుల నుద్ధరించుచున్

చం. సరసపు కీర్తనల్ మరియు చక్కని జోలలు గొబ్బిపాటలున్
మురియుచు నూయలూపి తన ముచ్చట దీరగ పెండ్లి కార్యముల్
సిరిమగనింట బండుగట సేవల కెన్నివిధంబులో పరా
త్పరునికి విన్న వించె మును పాటలు పాడుచు నన్నమయ్య తాన్

ఉ. ముప్పదిరెండు వేల పద పుష్పపు మాలల నన్నమయ్య తా
నప్పరమాత్మ కంఠమున హారముగా ధరియింప జేయగా
నెప్పుడు జిమ్ము సౌరభము హృప్తిని పొందెద రాంధ్రులెల్ల త
న్నెప్పుడు విస్మరింపరట నీభువినంతయు సంతసించుచున్



## శ్రీమతి వాడపల్లి రాధ

హైదరాబాదు (90320 44635)

చం. పదకవితా పితామహుడు, పావను డన్నమయార్యు డెన్నియో
పదములు వ్రాసె, పాటలుగ, పంకజనాభుడు సంతసింపగా !
వదలక వేంకటేశునికి వందల కీర్తన లందజేసి, యా
మధురపు నామ గానమున మాధవు సన్నిధి జేరె, హాయిగా !

మ. కో. లక్కమాంబకు పూర్వపుణ్యము లభ్యమాయెను పుత్రుడై !
నిక్కమే, హరిఖడ్గమామెకు నిండు సంతస మిచ్చుచున్,
చక్కగా నొడి నింపె 'వత్స'గ, సాగె నన్నమయాఖ్యుడై !
మక్కువన్ హరి నింపె వారికి, మానసంబున భక్తినే !

చం. చొరవగ వేంకటేశునికి జోలలు బాడుచు నూయలూపుచున్,
హరి సతి, వార్ధి కన్యకకు హారతు లిచ్చుచు నంజలించుచున్,
ధర గల జీవులందరకు తత్త్వము జెప్పుచు, వేల కీర్తనల్
పరచిన యన్నమయ్య , మన పాలిట దేవుని దూతయే సుమా !

తరళము (ధృవ కోకిల)
తిరుమలేశుని సన్నుతించుచు, తీర్థయాత్రలు చేయుచున్,
హరి కి గీతము లెన్నొ బాడుచు, హాయి నూయల లూపుచున్,
సిరిని గోరక, శ్రీనివాసుని చిత్తమందున నిల్పుచున్
ధరణి లో ఘనకీర్తి నందిన ధన్యుడీ యనమయ్య యే !



## డా.పాండాల మహేశ్వర్

గౌసుకొండ, యాదాద్రి (9912180054)

సీ. సతతంబుహరినామ సంపత్తి మదినమ్మి
వేంకటేశుని సదా వేడుకొనుచు!
ఆదిదేవుడుహరి ఆర్తిని తొలగించు
నాల్వేలు మంగమ్మ ఆత్మవిభుడు!
కొండల్ల నెలకొన్న కోనేటిరాయడు
తిరుమలేశుడుకదా కరవుదీర్చు!
అద్దదే అల్లదే ఆపదల్ తొలగించె
ఏడుకొండలవాసి యిచ్ఛదీర్చు!

తే.గీ. అన్నిరాసులయునికికి హరియె కర్త
విష్ణుపాదాబ్జ సేవయే వేడుకలర!
తాళ్ళపాక వంశాబ్ధి చంద్రాంశవోలె
హరినికీర్తించె నోరార అన్నమయ్య!

తే.గీ. భక్తి వైరాగ్యతత్త్వమే పావనముగ
మధురభావాలఆధ్యాత్మసుధను చింద
జానపదముల గానాలు జాలువార
అన్నమాచార్య తెలుగింటి కన్నబిడ్డ!

తే.గీ. తెలుగుపదముల బాణీల వెలుగతండు
భాష పదముల జిలుగుల పఱచు నతడు
వైష్ణవోన్నత సంస్కృతి తృష్ణయనుచు
గానమేయోగ పదమంచు ఘనతచాటె!



## శ్రీమతి వాణి సరోజిని లక్కరాజు

విజయవాడ (94910 54829)

ఉ. భక్తిని రంగరించి తన భావము లన్నియు మేళవించి యా
సక్తిగ అన్న మయ్య మనసారగ గానము జేసె కీర్తనల్
ముక్తిని గోరి సప్తగిరి మూర్తిని మానస మందిరం బునన్ .
రక్తిని నిల్పిగొల్చె నను రక్తిని పాడుచు నెల్లవేళలన్

తే.గీ. భక్తి వైరాగ్య శృంగార భావములను
తేట తెలుగున అనమయ్య తేనెలూర
రచన జేసెను ప్రజలెల్ల రక్తి బాడ
అన్నమయ్యకు మనసార అంజలింతు.

ఆ.వె. తెలుగు జాతిమెచ్చు తేటతెలుగు నందు
వేల కీర్త నలను వెలువ రించి
వేంక టేశు మహిమ విశ్వమంతయు జాటె
అన్నమయ్య భక్తి యమర మనగ

ఆ.వె. భావ మందు నితర బాహ్య ప్రపంచాన
అనవ రతము హరిని వినుతి జేసి
అన్నమయ్య చేరె నచ్యుతు చరణాల
ధన్యమనగ జన్మ ధరణిలోన.





## రేసోజు మల్లేశ్వర్

బండార్ నగర్, వనపర్తి జిల్లా
(9985375657)

తే.గీ. కడప జిల్ల రాజంపేట కడగల యొక
గ్రామమౌ తాళ్ళపాకలో లక్కమాంబ
సుద్విజుడగు నారాయణసూరి మేలు
టాలుమగలకు జన్మించె నన్నమయ్య.

ఆ.వె. తండ్రికోర వనికి దరలి కొడవలితో
బచ్చుగడ్డి కోయ బట్టు తప్పి
చిందె రక్త మకట! చిటికెన వ్రేలికి
గాయ మయ్యె నపుడె గేయ మొదవె

సీ. ఇంట జెప్పక నొక్కడేతెంచి తిరుపతి
పాదరక్షలతోడ బర్వతమ్ము
నెక్కుచుండ నలసి యక్కడె నిద్రించె
నన్నమాచార్యుడె యాదమఱచి
అలివేలుమంగమ్మ కలలోన గనిపించి
చెప్పులు వలదంచు జెప్పి వెడలె
కాలి నడకతోడ గదలుచు ముందుకు
నేడు కొండల మెట్ల నెక్కె తాను



తే.గీ. కాంచి శ్రీహరి రూపమ్ము కన్నులార
తన్మయత్వమ్మున మునింగి తత్త్వమరసి
యతని కంటె గలద! క్షితి నందమనుచు
నతుల వాగ్గేయకారుడై యవని వెలిగె.

చం. ముదముగ విష్ణుమూర్తి పయి మొత్తము ముప్పదిరెండువేల పై
బదకవితల్ లిఖించ దన పల్కులు తీయని పాటలై సదా
పదకవితాపితామహుడు,వైష్ణవ భక్తునిగా బ్రసిద్ధుడై
కుదురగు నవ్య శైలి నెలకొల్పెను గీర్తనలందు మేటిగన్.





## నిశాపతి ఎం.హెచ్.వి.సుబ్బారావు

హైదరాబాద్ (98483 30708)

చ. పదకవితా పితామహుడవై తిరువేంకటనాథుపైన చి
క్కదనము చక్కనందనము కన్నులు గట్టగ వేనవేలుగా
చెదరని భక్తి వ్రాసితివి శ్రీహరి నందము నంద నన్నమా
ఖ్య! దిశల వెండిపూతలిడ క్రమ యశస్ఫురదిందుచంద్రికల్

ఉ. ఆర్తిగ నల్లినావు పదమచ్యుతుపై మరి వ్రాసితంట ' సం
కీర్తన లక్షణ'మ్మనెడి కీలక కావ్యము సంస్కృతమ్మునన్,
పూర్తిగ నొక్క నీ శతకపున్ మధురత్వము దక్క నేదియున్
కర్తగ నీవొనర్చినవి కానము మా దురదృష్ట మేమిటో!

సీ. చందమామ రావె జాబిల్లి రావె యం
    చెలుగెత్తి గోర్ముద్ద కలిపినావు
జో అచ్యుతానంద జోజో ముకుందంచు
    బుల్లి పాపల నిద్ర బుచ్చినావు.
చండాలుని ద్విజన్ము సరినిద్ర గురుతించి
    బ్రహ్మమొక్కటెయని పలికినావు
కామిని పాపమ్ము కడిగిన పాదమే
    పరమపదమ్మని పలికినావు.

తే. జ్ఞానవైరాగ్యభక్తులు పూని వేరు
వేరు గాదని దెల్పు వివేకమతివి
తెలుగు వారల పున్నెంపు తోట వీవు
తెలుగు శారద వీణియ తీవవీవు!



## డా.ఉపాధ్యాయుల గౌరీశంకర రావు

విశాఖపట్నం (9550231590)

చ. స్వరమహితమ్ములౌచు రసవంతము లౌచు జగాన ధారలై
కురిసెడి కీర్తనావళి వికుంఠము జేరగ పద్మనాభుడా
'సరిగమ' సోయగమ్ములకు సంతస మందుచు దాసుడౌచు నీ
తిరుపతి కొండలన్ వెలసె దీయని నీదగు పాటమత్తుచేన్

ఉ. తల్లియు లేనివానికయి తల్లివి యౌచు విపంచిమీటి జా
బిల్లిని జూపితోయి పురవీథుల ద్రిప్పుచు జోలపాడుచున్
మెల్లగ నిద్రపుచ్చితివి మేలిమి మాటల స్వామి లీలలన్
వెల్లువ వోలె కీర్తనలు వేలకు వేలు రచించి పంచితో

ఉ. తేనెల వాకలై సరస ధీమయవాక్కుల నీదు కీర్తనల్
వీనుల సోకకున్న కనువిప్పుడు వేకువ, రాజభోగముల్
కానడు కండ్లు విచ్చి, తనకాంతలతో బవళింపుసేవకున్
మౌనమెదాల్చు శ్రీవిభుని మన్నన లియ్యవి నీదు పాటకున్

చ. పదకవితా పితామహుని వైష్ణవతత్త్వ విశేషగీతికా
శ్రధితుని తాళ్ళపాక విభు శాస్త్ర విరాజితు నాంధ్రసాహితీ
సదనపు దేవతాప్రభను జానపదంపు మృదంగ రావమున్
గదిలిన కత్తి వాదరను గారణ జన్ముని ప్రస్తుతించెదన్.





# శనగల సుందరరామయ్య

కోదాడు (6305339367)

1) సదమల తాళ్ళపాకపురి జన్మము గాంచి, కవిత్వచాతురీ
హృదయము తండ్రినుండి స్వరరీతు ల వెల్లను తల్లినుండియున్
బొదువుకొనంగ,గూర్చుచును బొల్పుగ గొల్చుచు విష్ణుపాదమున్
"బదకవితాపితామహ" సునామక మందితి వన్నమయ్యహెూ!

2) జానపదపదములను బ్రసన్ననాద
కలితమంజీరయుతముల సలిపి హరికి
నించు పాటల బాడి యాడించి యన్న!
"అన్న"వైతివి కవుల కో "అన్నమయ్య"!

3) అమ్మ చూపిన ప్రణయకోపమ్ము, నయ్య
పలువిధమ్ముల జేసిన ప్రార్థనములు
నద్భుతముగ నాలాపించి యన్నవైతి
వాహ! వాగ్గేయకారుల కన్నమయ్య.!

4) అమ్మ చెలువపు రాశియే యఖిలరాశి
యునికి యనుచు నిరూపించి తనివిదీర
నద్రి మహిమంబు బ్రకటించి యన్నవైతి
వౌర!యా పదకవులకో యన్నమయ్య.!

5) అలసిసొలసి యంతర్యామి!యంతట నిదె
నీ మఱుంగును జొచ్చితి నే నటంచు
నందకముగ వెంకన్న చెంతకును జేరి
యన్న వైతివి భక్తుల కన్నమయ్య!



## కొరుప్రోలు రాధాకృష్ణరావు

మీర్‌పేట,రంగారెడ్డి (9908128624)

కం. అలరులుగూర్చెనుమాలగ
జిలికిన నాబలుకులందు జిన్మయుడగుచున్,
నిలయము శ్రీశైలంబున
బలుకగనాడన్నమయ్య భక్తిగ శృతులన్

కం. పదకవితాసాహిత్యము
వదలకనా వాఙ్మయంబు బదనుగబలుకన్,
సదమలమంగళహారతి
పదపదమునదేలియాడుబరవశమగుచున్

కం. 'మమపా'స్వరములగరిమము
సుమనసరాగములనందిసొబగులనొసగన్,
సుమమునుబోలినశిశివులు
క్రమముగనిదురించువారుగానపుధృతిలో

కం. మధుర పదమ్ము లు బలుకగ
మధురమ్మౌ నమ్మపలుకు మనమున నాటన్,
విధములుబ్రాంతములందున
సుధలనుజిలికించునంటసుందరవసుధన్

మ. అదిగోచూడుము వేంకటాద్రినని యాహ్వానించె సంకీర్తన
ల్మదిలోరూపమునారసింహుడన శ్రీమంత్రంబువల్లించె, దా
పదమైరాముని బంటుగా నిలిచి శ్రీపాదంబుసేవింప, నే
సదమున్గొల్చెదనన్నమయ్య నన్శ్రీసంగీతతత్త్వంబునై




## డా.అయ్యలసోమయాజుల సుబ్బారావు

హైదరాబాద్ (9510079281)

కం. నందకమను కత్తి భువిని
బొందిక రూపమును దాల్చి భూజాని రమన్
జందపు పదములనల్లగ
విందందరి వీనులకట వేంకటగిరిపై.

ఉ. ముప్పదిరెండువేల పద మోక్షపు గానము నాంధ్రభాషలో
చెప్పిన రీతి, శబ్దములు, జీవుల భాగ్యము వేంకటాద్రిపై
గొప్పలు గావు, చంద్రగిరి కోటను సాళువ సింహ రాయనిన్
మెప్పుల నొందగన్ బొగడె మేలుగ వైష్ణవ సంప్రదాయమున్.

తే.గీ. కొండలందున నెలకొన్న కోవెలందు
నిగమ నిగమాంత వర్ణిత నిర్జరుండు
విన్నపాలు వినుమనెడు వింత హెూత్ర !
బ్రహ్మ కడగిన పాదము పాట ప్రణుతి !

మ.కో. అన్నమయ్య పదాలు దివ్య సమాహ్వ మాలలు కీర్తనల్
చిన్నకారున ముత్తి గోరి రచించె బ్రహ్మము నొక్కటే,
సన్నగించును పాపకర్మ, విశాల తామర సాక్షినిన్
విన్నవారిల ధన్యులవ్వల వేడ్క నుందురు భక్తితో.



## కరణం రాజేశ్వరరావు

హిందూపూరు (9182329440)

1) ఘనమగు భావ జాలములు కమ్మని కీర్తన లందు మాధురుల్
మునుకొని సామ్య వాద సమ బోధలు సేసెడు గాన సృష్టితో
జనతతి మానసంబులకు సర్వ సుగంధ సులేప భక్తితో
సునిశిత రీతి భక్తులకు సుందర దేవుని దర్శనంబిడెన్

2) శ్రీనివాసుని లీలలు చిత్ర గతుల
వర్ణనము జేయ పదములై వాసి కెక్కి
భక్తి భావము బెంచెడి భాగ్య మొసగి
యమరుడై వెల్గె పదకర్త యన్న మయ్య

3) సులభ శైలిని గ్రహియించి సూక్ష్మ మైన
విలువ లన్నిటి దెలిపిన విజ్ఞ వరుడు
వేంకటేశ్వర భక్తుడై వేద వేద్యు
చరణ యుగమును సేవించె శక్తి కొలది

4) తిరుమల పతిని గొల్చిన దివ్య తముడు
భక్తి పరవశ చిత్తుడై పద రచనలు
ముప్పది యు రెండు వేలను పూర్తి జేసి
భక్త కోటికి నందించె పావనుండు





## శ్రీమతి వడలి వెంకట నాగ వరలక్ష్మి

విశాఖపట్టణం (9381415881)

1) ఆపదవేళనాదుకొను నండ తలంచిన చాలునిక్కటు
ల్బాపెడు దైవమాశ్రితుల పాలి సుధాంబుధి గానలోలుడా
శ్రీపతి నంటియుంటును విశేషములేర్పడ చెప్పె నన్నమ
య్యా పదముల్ధరా తలము నార్తుల కాప్తములై శమమ్మిడున్

2) పదకవితా పితామహుడవై వెలయించితి వీవు కీర్తన
ల్పదునగు భక్తి తత్త్వముల బాడి తరించితి వన్నమయ్య మా
కదియిది కీర్తనేది వినినంత మనమ్ముపశాంతి నొందు మా
కదియె నదృష్టమై కనుల నాపరమాత్ముని నిల్పు నెప్పుడున్

3) ఎఱుగము నాథు వైభవము నెక్కుడు చెప్పె పదంబులందు జూ
చెఱుగము నాథు నుత్సవము లేర్పడ జూపెను కీర్తనంబులం
దెఱుగము తల్లి లాలనము నింపుగ బాడుచు బోధ చేసె నే
నెఱుకను అన్నమయ్య గతి నేగుచు వేంకట నాథుఁగొల్చెదన్

4) కావ్యమె మోక్ష సాధనము కాలము నాడు బురాణగాథలే
సవ్య పథమ్ము జూపె సొగసౌ హరి లీలలు వేనవేలు వా
నవ్యయ సామవేదమున నన్నమయా తగు రీతి జాటె నా
నవ్య పథమ్ము నచ్చి తదనంతర భక్తులు నాచరించిరే



# శ్రీమతి ఆరవల్లి శ్రీదేవి

హైదరాబాదు (9959499975)

మ. కో. విన్నపాలను విన్నవించెడి వేళ దేవికి చెప్పగా
విన్నవారికి భక్తి భావము వృద్ధి చేసెను ముక్తికై
చిన్నికృష్ణకు జోలపాడెనుచేరి తల్లిగ ,ఊయలై
అన్నమయ్యగ నందకమ్మది హర్షతన్ జనియించెగా

ఆ.వె. ఏడుకొండలెక్కి యెలుగెత్తి పిల్వగా
అమ్మవచ్చి తెలిపె కమ్మ దనము
కోటిగొంతులెత్తి"గోవింద"యనగానె
కోర్కె తీర్చు ననుచు కొసరి తెలిపె.

ఆ.వె. విన్నపాలు విన్నవించె వింత కథల
చిన్ని కృష్ణునికిని మిన్న జోల
కొండరాయి పొగడ బండలన్నికరంగ
పరము నందె పాట వరము మనకు.

చం. ఘనమగు వేంకటేశునటు కమ్మగ కీర్తన జేయగా తనే
అనువుగ పాటలల్లగనె యందరు పాడగ భాగ్య మేయనన్
మననము జేయు మంత్రమది ,మాధవు నామము మోక్షమిచ్చు,సా
ధనమది శ్రీనివాసునిల, తండ్రిగ గొల్వగ మార్గమే యనెన్.




## మాచవోలు శ్రీధర రావు

హైదరాబాదు (9441833788)

ఉ. ముప్పది రెండు వేల పదముల్ సృజియించుచు నన్నమయ్య తా
జెప్పెను విష్ణు తత్త్వమును ఛేదన చేయగ మూఢ భావనల్
చొప్పడగా జనమ్ములకు స్ఫూర్తి నొసంగెడి రీతులందుచున్
గుప్పిట జేర్చె కైతలను గొప్పగు వాడుక భాష నెంచుచున్

చం. పద కవితా పితామహుడు వాక్కును గేయము నందిముద్దుచున్
సదమల వృత్తినిన్ బలికి చక్కెర మోవిని జేర్చి తల్లినిన్
ముదమిడు చాంగ్ భళాల, కయి మోడ్పుల చల్లని దేవదేవునిన్
మదినిడి ముక్తి నందె పద మార్గము లో బయనించి నంతటన్!

మ.కో. అందమైన పదాల జేర్చుచు నన్నమయ్య వచించె గో
విందు కీర్తన లింపులౌనటు వేల సంఖ్యను భక్తి తోన్!
విందొనర్చగ జోల పాటను బ్రీతి గొల్పె ముకుందునిన్,
చందమామను వెన్న పాలను స్వామి కీయగ తెమ్మనెన్!

ఉ. పల్లె పదమ్ములన్ దెనుగు భాషకు గీర్తి గడించి పెట్టగా
నల్లితి వన్నమయ్య, కడు హ్లాదము తోడుత పాట లెన్నియో !
అల్లన వేంకటేశు గన నల్లదె శ్రీహరి వాసమంచు నీ
యుల్లములోన పైకెగయ నుల్లస మయ్యదె చిందె మాధురుల్ !

 

# మఠం శివకుమార్

నారాయణ ఖేడ్, సంగారెడ్డి జిల్లా (9490523981)

శా. ఏ సంకీర్తనలీశుతత్త్వ సరళిన్ హేలావిశేషంబుగా
శ్రీసంగీతధునీవిహారవిజయశ్రీభూతిగా నిల్పెనో
యా సంకీర్తనకారవర్గవరునిన్ హ్లాదమ్ముతో ప్రేమతో
నే సంధిల్లెడి భక్తి మ్రొక్కెద హరీ! నీ పాదమున్ దల్చుచున్!!

కం. నిగమనిగమాంతవర్ణిత
భగవానుని భక్తిగేయపరిమళములతో
సుగమముగా బూజించిన
నిగర్వి తాత్త్వికునకు లలి నిత్య ప్రణతుల్!

చం. ప్రవిమలభక్తి బాలునిగ రాజుగ తండ్రిగనెన్నొ భంగులన్
శివసఖుడైన శ్రీహరిని శీఘ్రమె మార్చెను వాని కీర్తనల్!
కవనము సర్వవర్గములు కమ్మనియాస్తిగనెంచ మూలమై
దివిభువి సంతసమ్మునను దీటుగనిల్చెను తాను కీర్తనై!!

కం. సర్వ జగత్ శ్రేయస్సున
పూర్వముగా కాంక్ష చేసె పుణ్యాత్ముండున్!
పర్వమ్మాతని చరితము!!
కర్వరి బుట్టిన విరాళికవనమితండే!!

 

## జి.విశ్వామిత్ర

హైదరాబాదు

కం. పద కవితలనాంధ్రంబున
సదమల భావముల కూర్చి సద్భక్తిని యిం
పొదవగ హరిని నుతించిన
బుధవర్యుని నన్నమయ్య బొగడెదనెదలో.

కం. మంగళ పద్మావతి హే
మాంగుల పై సొంపుగా సమంచిత రీతిన్
శృంగార భక్తి రసములు
పొంగారగ కీర్తనలను పుట్టించితివే.

ఉత్సాహ. గారి గరిస దసరి గరిస గపదపగరి గరిస యం
చారయ స్వరరాగ యుతములౌనటులుగ కీర్తనల్
చారు తరముగా విరచన సాగ జేసితివి యహో
సారమతివి యన్నమయ్య సాదరప్రణామముల్.

ఉ. తావక కీర్తనమ్ముల సుధారస ధారలు గ్రోలు భాగ్యమాం
ధ్రావళి కొప్పె నిట్టులహహో యవి మోక్ష పథమ్ము జూపుగా
నీ వసుధాస్థలిన్ సమత నెల్ల దిశల్ ప్రసరింపజేయు స
ద్భావ మరంద మాధురులవారిత నిశ్చల శాశ్వతోక్తులౌ.



## మంథా భానుమతి

హైదరాబాదు (9553634832)

ఆ.వె. శ్రీనివాసు దదియె శ్రీకళలు మెరయ
గోచరించె కనుల కోటి జిగిని
వచ్చెనిలకు ప్రథమ వాగ్గేయకారుండు
అన్నమయ్య తాను మిన్నగాను.

కం. మేలుకొలుపు మధురముగన్
లాలిత్యపు లాలిపాట రమ్యస్వరమున్
తాళసహితముగ చేయన్
మౌలి నొదవె నన్నమయ్య మాధవు నాజ్ఞన్.

మ. హరి సంకీర్తన లార్ద్రతన్ మురియగన్నాలాపనన్ జేయుచున్
గిరులన్నాగక భక్తితో నరసి వేగించంగ శ్రీ వేంకటే
శ్వరు సాన్నిధ్యము జేరి నిక్కముగ నాచార్యుండు పేరెన్నికన్
సిరులొల్కంగ పదమ్ములన్ కలిపెనే శ్రీదేవి మెచ్చున్ మదిన్

సీ. సంగీత సాహిత్య సమ్మేళనములవె
సంతసమ్ముగ నింట జరుగు చుండ
కవయిత్రి తిమ్మక్క కలికి తానిల్లాలు
వారసత్వము వచ్చె వారలకును
పుత్రులున్ మనుమలు పోడిమి రచియించె
సంకీర్తనలు తాము శమముగాను





వర్ణించె హృద్యమున్ పద్మావతీ సఖు
లీలలన్నియు నెమ్మి రీతి గాను.

తే.గీ. వేంకటేశుని కీర్తించి వేడు కొనగ
వాడలన్నిట మ్రోగెనే పదకవితల
వెల్లువ మనోహరమ్ముగా తాళ్లపాక
అన్నమయ్య పాట వినగ మిన్నగాను.



## కాటేపల్లి లక్ష్మీనరసింహమూర్తి

మిర్యాలగూడ (9849082669)

చం. మృదుపదభక్తికీర్తనల మీగడ చక్కెర లద్ది కొల్చెనో,
పదముల వేంకటేశ్వరుని పాడి తరించిన 'అన్నమయ్య', సం
పదలను భోగభాగ్యముల మత్తుల జిక్కని మానవీయు, డీ
'పదకవితాపితామహుడు' – పావన 'నందక' సచ్చిదంశయే !

ఆ.వె. చెలువగు 'పదివేల శేషుల పడగలె
యేడుకొండ లయ్యె' నిదివొ, యనుచు,
'బ్రహ్మ కడుగు పదమె బ్రహ్మ ' మనుచు దెల్పె,
'బ్రతుకు నాటక' మను పరమయోగి!

ఆ.వె. నలువ – లక్కమాంబ నారాయణాఖ్యుల
నుదుట వ్రాయ బండె, నోము పంట
తాళ్ళపాకవంశ దైవాంశసందీప్త
మయ్యె వరసుతునిగ, నన్నమయ్య!

ఆ.వె. తెలుగునేల దివిని తిరుమల మలయప్ప
మహిమ పదకవితల మలచి కొలిచి
భక్తకోటి మతుల పదిలముగా నిల్చు
అన్నమయ్య – సజ్జనార్చితుండు !





**శ్రీమతి చావలి బాలకృష్ణవేణి**

హైదరాబాద్ (83413 53323)

శా. స్వామీ యంచు కృపానిధిన్ బొగడగా వైభోగ రాయుండుగా
నేమీ యన్నమయా ! యటంచు పిలుపున్నిండార బిల్వంగ దా
నేమీమాంసయు లేక నీవు ప్రభువున్నిక్కంబు సంకీర్తి దే
లీ మాకీయగ వేల కీర్తనలు రారే ! దేవతల్ హర్షతన్!

క.కం. శరణంబుగోరి ప్రభుసన్నిధినిన్ భవరోగ నాశికై తా
భరణంబొసంగి మధుభావలయాన్వితుడైననీవు సామిన్
చరణంబు నిల్పి తగు శాశ్వతమౌవిధమందు బాడగా నా
హరియంశవైన నిను హాళిని మౌళి యనుగ్రహించె కీర్తిన్..!
(కవికంఠవిభూషణము...సజసససజగగ -9.యతి)

ఉ. లోకము ప్రస్తుతిన్ ప్రణవ లోకపు సారసరీగమాలునై
నాకము జేరియుండ తగు నాట్యము చేసెను అన్నమయ్యతోన్
దాకగ హృద్యమై వివిధ తాళలయాత్మక కీర్తనాదులున్
రాకలు పోకలున్ బడని రాజిత జీవన మోక్షసిద్ధికై!!

మ.కో. తేనెలూరగనీవిరాళి విధేయభావనలంతయున్
గానమాధురియింపుగూడిసకాశ దీప్తులు రాజసం
బౌనటుల్ పలికించెనన్నయ పండితుండు పునీతుడై
శ్రీ నగాధిపతిన్ తపింపగ జేరె యుక్తము లయ్యెడిన్..!!



# డా.ఆర్.వి.ప్రసాద్

కొడాలి (9866367158)

ఉ. పొందగ బుత్రసంతతిని పూజలొనర్చగ తాళ్లపాకలో
కందువ నాలకించుచును కామిత మీయగ వేంకటేశుడే
నందక ఖడ్గమంశ గను నందవరీకపు వంశమందునన్
బొందిరి ‘ సూరి ‘ దంపతులు బోడిమి బుత్రుని దైవికంబుగా

కం. అన్నమ్ము పరబ్రహ్మం
బన్నంబే ప్రాణమూలమని దెల్పంగన్
దిన్నగ నిల్పిరి నామం
బన్నమునిగ దమసుతునకు హర్షము తోడన్

ఆ. వె. చిన్ననాటి నుండి మిన్నగా కీర్తించి
వేంకటేశు పైన వేనవేలు
దినము నొక్కపదము దీరుగా రచియించి
భక్తి నన్నమయ్య ముక్తినొందె
మచ్చుకు మూడు కీర్తనల భావసారం

ఆ.వె. కొండల నెలకొన్న కోనేటి రాయుడు
గోరు వరము లొసగు గొండలంత
కచ్చినమ్మి కురువ కథల గానము జేసి
యన్నమయ్య దెల్పె నాలకించు



ఆ వె. తందనాన యనుచు దందనాలను ద్రొక్కి
బ్రహ్మ మొక్కటె యని పాడి తెలుప
దరతమము లనెడివి తనువు దాక వనుచు
నన్నమయ్య దెలిపె నాలకించు

ఆ.వె. నాటకమ్ము బ్రదుకు నానాటికీ యని
చావు పుట్టుకలను సమము జేసి
వేంకటేశు గొలువ వెతలు బాపుననుచు
నన్నమయ్య దెలిపె నాలకించు



# సూర్య కటకం

బెంగళూరు (9845165825)

కం. తిరుమల వేంకటరమణుని
చరణములే శరణమనుచు సంకీర్తనముల్
హరిభక్తాగ్రేసరుడై
వరముగనిడె నన్నమయ్య వంద్యుండతడే

తే.గీ. అలర చంచలమంచు నాత్మానుభవము
నిగమ నిగమాంత వర్ణితు నిక్కమెంచి
బ్రహ్మ కడిగిన పాదము పరమమనుచు
అదివొ హరివాసమదె జూడుడంచు దెలిపె

తే.గీ. అన్ని మంత్రములిందటంచాశ్రయించి
పలుకు తేనెల తల్లిని ప్రస్తుతించి
వినుడు భాగ్యమని దెలిపె విష్ణుకథను
ఘనుడు దానన్నమయ పదకవితలల్లి

చం. ముదముగ వేంకటేశ్వరునమోఘపదామృతకీర్తనంబులన్
సదమల భక్తితత్పరత సంస్తుతి జేసెను సంతతంబు దా
పద కవితా పితామహుడు భవ్య కవీశ్వరుడన్నమయ్య శా
రద కరుణా కటాక్ష వర లబ్ధ విశారద వైభవంబునన్







## హరిసంకీర్తనాచార్య అన్నమయ్య

మ.కో. భక్తి భావము దోడ నిత్యము స్వామి కీర్తి నుతించుచున్
రక్తితో పరమాత్మమాత్మల రాగబంధమునెంచుచున్
ముక్తి మార్గము జేరగా మది మోహమున్ దొలగించెడిన్
శక్తిగా దన కీర్తనల్ భువి చాటెనన్నమయార్యుడే

ఆ.వె. తేనెలూరు తేట తెనుగు పదములందు
శ్రీనివాసు గొలిచె చిత్తసీమ
పూనికగ రచించె పుణ్య కీర్తనములు
మానికముగ నిలిచె మాన్యులందు





# ఈశ్వరప్ప కవి

ఆలూరు కర్నూలు జిల్లా (9885336485)

ఆ.వె. అన్న మయ్యవంటి యద్భుతవ్యక్తిని
వేంకటేశుడైన వెతకగలడ?
మంగమాంబ దేవి మనసునదాగిన
భావభంగిమలకు జీవముంచి

కం. సరసపు సంభాషణ లో
స్థిరమగు టౌశ్లేషనింపి దివ్యత్వంబౌ
విరివిగ భక్తిని బంచిన
మరువని మహనీయుడేగ మాధవకృపతో!

ఉ. కీర్తన లెన్నియో దెలిపి కీర్తి యునందెగ యన్నమయ్య! తా
కర్తగ దివ్యదీపముల కాంతియునింపెను భావమందునే!
ఆర్తిగ వేడుచున్ రచనలాడగ నాలుక నాట్యమాడులే!!
పూర్తిగ భక్తకోటికిల పుష్కరిణయ్యెను కీర్తనల్ వినన్.

కం. వ్యసనము లేదును మాన్పెడి
పసగల కీర్తనలు దెలిపి భక్తికి నిధియౌ
కుసుమాల మాల వలెనే
విసుగును దరిజేర్చనట్టి విలువగు రచనల్!





## శ్రీమతి ఆకుండి శైలజ

విజయనగరం (6304656354)

మ.కో. తాళ్ళపాకను బుట్టురత్నమ! తండ్రిఅన్నమయా నినున్
మళ్ళనీ నిజ భక్తితో భువి మానవాళియె గొల్తురే
కుళ్ళుబట్టిన ఈ సమాజము కూర్మితోతళుకొత్తగా
పెళ్ళగించితి వయ్య గుండెల పేరుకొన్న విరాళినే

మ.కో. లాలిపాటలు, జోలపాటలు లక్షణంబుగ నెన్నియో
మేలుభక్తిని దోయిలించుచు మెచ్చినావుగ శ్రీపతిన్
వేలపాటలతో రయమ్మున వేడి వేంకటనాథునే
మేలుకొల్పులు పాడగా విని మేల్కొనెన్ హరి నిత్యమున్

తరళము. పదము లందున పాలధారల పంచదారలనద్దుచున్
హృదయమందున శ్రీనివాసుని నింపుగా దరిసించుచున్
మధుర గీతిక తోడ వెన్నుని మంగళమ్ముగ గొల్చుచున్
పదులు వందల కీర్తనమ్ములు వ్రాసినావుగ నయ్యరే

తరళము. పరవశించిరి వేల్పులెల్లరు ప్రాభవమ్మగు పాటలన్
స్థిరముగావిని మానసమ్ముల తీర్థరాజములందునన్
కరిగిపోయెను శ్రీనివాసుడు గాంచినీపద భక్తినే
చిరముగానిను నిల్పెనీధర చిందగా హరికీర్తనల్!!!



## శ్రీమతి ఝాన్సి మంతిన

హైదరాబాదు (8142973229)

ఉ. కన్నులు విప్పియమ్మ నదె గానగ నామెయు మోమునన్ ముదం
బెన్నగముద్దులన్ గుడిపి ప్రేమగ బాడెను జోలలచ్యుతా!
తేనెలు జారియున్ పెదవి తీపియు వీనుల జేరగా గనెన్
చన్నుల పాలతో నొడల జారెను గమ్మని గానవాహినై

ఆ.వె. చందమామ రావె జాబిల్లి రమ్మని
బువ్వపెట్టు వేళ యవ్వ పాట
కొలని దోపరికిని గొబ్బిళ్ళ పాటల
గడిచె బాల్యమంత యడుగు నడుగు

ఆ.వె. పెండ్లి వేళలందు బేరంటములయందు
పూజలందు మరియు పున్నమందు
రోటి కాడిపాట యాటలందున పాట
మురిపె ములను పాట మరపు పాట

ఆ.వె. అన్నమయ్య వారె యన్ని వేళల యందు
అంతులేని సంపదట్లు గూర్చె
వారి ఋణము దీర్ప నేరి తరము గాదు
పదము పైన బడుదు భక్తిమీర



## పేరి అప్పాజి

కాకినాడ (8897716466)

సీ. అన్నమయ్య కవితసన్నుత మాయెనే
శ్రీవారి కళ్యాణ సేవ కొఱకు
కన్నడౌ వెన్నుని కైంకర్య భాగ్యమే
కనువిందు కలిమియై కామ్యమిడును
సాతత్య సాయుజ్య సౌభాగ్య సాఫల్య
వరమిచ్చు పరమాత్మ! వనజనేత్ర!
వేవేల జన్మల విపరీత పాపాలు
శ్రవణమాత్రముతోడ శమమునొందు
గీ. తాళ్ళపాకస్థు ధన్యుని తరణదర్శి
నెపుడునుమదిలో స్మరియింతునిచ్చతోడ
తిరుమలేశ భక్తవరుని 'తిరు' పదమును
నంజలింతును ముదమున నమలమతిని !!!

సీ. ద్రవిడభాషాపదరవళిని పదముల
బంధాలతోనింపి పదములిడిన
ముప్పదిరెండ్వేల పూర్తిగా వేనోళ్ళ
పదకవితల గానపారగుండు
శ్రీవేంకటేశుని శ్రీభక్తగణ్యుండు
శ్రీప్రదచరణమె సిరిగదలచు
కీర్తనగానమ్మె యార్తినిబోగొట్టు
పరతత్త్వబోధన పారమిడును



గీ. శ్రీనివాసకీర్తనలందు శేవధినిడి
పద్మమంగరాణులపతి సద్మదీప్తి
తాళ్ళపాక పదమ్ములన్ దర్శనమగు
వరదగోపభక్తుడుసెప్పు శరణపథము !!!

సీ. తిరువేంకటేశుని తిరునామ మంత్రమే
వేయిజన్మలకంత వెల్గునిచ్చు
తిరుపద్మజానిదౌ తిరువివాహమ్మది
కన్నులపంటయౌ కలిమినొసగు
వేంకటేశ్వరునాథు పెండిలివేడుక
పదకవితలయందు వాసిగనెను
అన్నమయ్యార్యుని కన్నని 'నందక '
మందురు భక్తులు మహితమతిని !
గీ. తిరుమలేశునికీర్తియే గురుశరణము
రుచిగనానందనిలయంపు శుచినిదనరు
పద్మజాపతి లీలలే పదములందు
తిరుగునామజప్యపదము దివ్య కాంతి !!!

శ్లో. పదార్చనాగ్రేసరభక్త పూజితం,
సదైవ శ్రీవత్స సు'నందకం' వరమ్ !
సహస్ర ద్వాత్రింశతి కీర్తనప్రదం,
నమామి 'ఆచార్య' పితామహంకవిమ్ !!!





## శ్రీమతి పోలంరాజు శారద

హైదరాబాదు (9392127895)

ఉ. నందక మామతించగను నామమొసంగగ నన్నమయ్యనన్
సందడి కూడి జేరగను సామి సుదానము బాలుడయ్యుతా
పొందెను పున్నెమున్ గనగ భూతలనాథుని భక్తిభావమున్.
బంధము వీడి జేరెనట పావన మూర్తిని పారవశ్యమున్

కం. దినమునకొక పదమనుచున్
మనమున వేంకటరమణుని మైమరిచితివో
తనువు పులకించు పామర
జనులగు తేట తెనుగు పదజాలము వినగన్

తే.గీ. లాలి పాటల రమణుని లాలనములు
షోడశోపచారములను శుభము గొల్ప
మధురభక్తి నవరసపు మాల లల్లి
కొలిచినావు ధన్యుడవయి కోర్కె మీర.

ఉ. పెన్నిధి నీవనంచతని పేరిమి కొల్చిన భక్తితత్త్వముల్
సన్నిధి కోర చేరితివి సామిని ముక్తిని పొందినావుగా
కన్నుల కాంచినావు నరకాంతుని తోషము నందినాడవే
మన్నన పొందితీవు పరమాత్ముని మున్కలి ధన్యజీవివై.



## డా.పిలకా శాంతమ్మ

శ్రీకాకుళం (9866128187)

1) వెన్ను ఖడ్గ మాయె నంత వింత నన్న మయ్య గా
చిన్ని బాలు రూపు పొంది చేరె లక్క మాంబ నే
పొన్న చెట్టు నీడ లోన పొంచి వేంక టేశు కై
విన్న పాల పూల సెజ్జ వేసి నావు సంధ్య లో!

2) చందమామ రావె యంచు జాబిలమ్మ పిల్చుచున్
అందమైన పాట లల్లి యంక మందు జేరగా
నెందు గాన మిట్టి వాని నెంత వేచి చూచినన్
విందు జేసె భక్తి మీర వేంకటాద్రి నాథుకై!!

3) తాను తాళ్ళపాక వారి తన్వి యందు పుట్టె గా
వేనవేల కీర్తనాలు వీను విందు జేయగా
అన్న అన్నమయ్య పాట యచ్చతేనె ధారగా
విన్న వారి జన్మ లన్ని వేగ ధన్య మాయెనే!!

4) ముప్పదారు వేలు దాటి మోదమొప్ప పాడెనే
చెప్ప వీలుకాని దేవుచేష్టలన్ని చెప్పెనే
అప్ప! లక్కమాంబ నీదు నర్చనే ఫలించగా
తప్పులన్ని తీరి పోవ ధన్యమాయె జన్మమే!!!





## కవిశ్రీ సత్తిబాబు

హైదరాబాద్ (8074506521)

మ.కో. ఏడుకొండల వానికీర్తిని నెల్లలోకము చాటగన్
వీడకుండను చెన్నకేశవు వేడి మ్రొక్కుచు పాటలన్
వాడుకైన పదాలచే తమవారలందరు మెచ్చగన్
వేడుకన్ లిఖియించి పాడెను వేంకటేశుని సన్నిధిన్.

తరళము. మధుర గాయకు డన్నమయ్యకు మాధవుండును తోడుగా
హృదయ మందిర మందు నిల్చుచు బుద్ధి వెంబడి యుండగన్
మధురతత్త్వము లెన్నియో ప్రవణంపు బాటల జేర్చుచున్
పదము లల్లెను కీర్తనమ్ముల పామరాదులు మెచ్చగన్.

తరళము. తెలుగు తల్లికి ముద్దుబిడ్డడు తీరుగా సమకూర్చగన్
వెలుగు చూచెను పాటలై పలు వేనవేలుగ కీర్తనల్
అలర చంచల మానసమ్ముల కాత్మబోధను చేయుచున్
సులువునన్ పద జాలమద్దెను సోయగమ్ములు చిందగన్

మ.కో. వేంకటేశుని దివ్యసన్నిధి విస్తృతంబగు పాటలే
అంకితంబయి చాటుకొన్నవి యన్నమయ్యకు కీర్తిగన్
వంకబెట్టని యోగి యాతడు బ్రహ్మవేత్తయు చూడగన్
పంకజాక్షుని ఖడ్గమే యని పండితోత్తము లందురే.



## రెబ్బాప్రగడ వేంకటనాగ సంతోష శ్రీనిధి (10వ తరగతి)

విశాఖపట్నం

త్రిపద: వైశాఖమాసాన పౌర్ణమి తిథియందు
శ్రీసతీశుని గొల్వ నిచ్చె
నా శ్రుతులను పాట జేసి

ఆ.వె. వేంకటాద్రి మీద వెలసిన శ్రీపతి
యంత జూపె కొండ లంత వరము
నడుగ పరమ పదము నందె కైవల్య ప
థంబు నంద కాంశ తాను తెలిపె

సుగంధి. చంద మామ రావె యన్న చంటి బొజ్జ నింద దా,
యంద రాని వాడె యైన యంద గాడు నిల్చె నా,
ముంద రున్న చంటి బాబు బోసి నవ్వు నవ్వ గా,
వంద నంబు లన్న మయ్య వంద కోట్లు నీకివే

సుగంధి . అన్న మయ్య పాట. వించు నద్రివాసి మేల్కొ నున్,
విన్న పాలు విన్న వించి వేడు కొందు స్వామి నే,
పొన్నమాను చెట్టు క్రింద ముద్దు రంగ జూపు నే
వెన్న దొంగ కాన వచ్చు విస్తు బోవ నంత నే





## రెబ్బాప్రగడ సత్యశృతీష్, (తొమ్మిదవ తరగతి)

విశాఖపట్నం

త్రిపద. సంకీర్తనాచార్య యన్నమాచార్యుడు
వేంకటవిభు పాదమందు
సంకీర్తనఫలములుంచె

ఆ.వె. జోలపాట యనిన జోయచ్యుతానంద
గాకనింక నేమి జ్ఞప్తివచ్చు
నందునింటబుట్టి మందలుగాచిన
ముద్దుగోపబాలు మోము మెదలు

సుగంధి. లక్కమాంబ గర్భమందు లక్ష్మినాథు గొల్వగా,
నొక్కమారు నందకంబు నుద్భవించె భూమి నం,
దొక్క కీర్తనంబు చాలు నూపమమ్ము డోల లన్,
దక్కు వేంకటేశు పాదదర్శనంబు పాటలో

మానినీ. కొండలరాయుని కీర్తన జేయగ కోరికలన్నియు తీరును గా,
దండలువేయరె నామము దిద్దరె తండ్రికి వేంకటనాథుని కీ,
యండగ నుండెడి స్వామికి బూరెలు, నావడ, గారెలు విందులుగా,
పండుగనేడట యూయలలూపగ పాటలపల్లకి మోయుటకై.



# సింహశ్రీ

అనంతపూర్ (8331815011)

చం. తిరుమల శ్రీనివాసు కథ దెల్పు పదమ్ముల నల్లి, పాడి పా
మరులకు నైన ముక్తిగొను మార్గము జూపె జగద్ధితమ్ముగన్
హరి కరవాల తేజ మిల నారదు సూచన గొంచు నన్నమ
య్య రహి నొసంగె సర్వులకు నార్తిని దీర్చుటకై ముదమ్మునన్!

సీ. తన దాసుని కొరకు ధరియించె నీ రూప
టంచు దెల్పితివయ్య హాయి మీర
భవనాశియౌ నహోబల నారసింహుని
నరరూప గరుడాద్రి నతు లటంచు!
ఫాల నేత్రానల ప్రబల విద్యుల్లతా
కేళీవిహార యో కేసరిముఖ
యనుచు శ్రీ నరసింహు ననునయమ్మున గొల్చి
పదకవితలతోడ ముదము మీర!

తే.గీ. శేషశైల నివాసుడు శ్రీహరి యని
గాన పుష్పార్చనల తోడ వీను లలర
పదము లల్లినట్టి మహానుభావ యన్న
మయ్య గొనుమివె దివ్య నమశ్శతములు!

సీ. మాధవా కేశవా మధుసూదనా చక్రి
బృందారకాధీశ వందిత పద
భవ ఘోరతిమిర దుర్భవ కాల మార్తాండ



హరి విరించినుత ప్రహ్లాద వరద
పరమపురుష నిత్య పరిపూర్ణ గోవింద
ఆనంద నిలయ సహస్రబాహు
భవ కమలభవ మాధవరూప సర్వేశ
పాకశాసన వంద్య భయవిదూర

తే.గీ. వరద వసుధావధూవర పద్మగర్భ
భవ దురితభంజ గోవింద పాహిపాహి
యంచు వెన్నుని బొగడిన యన్నమయ్య
మానవుల యార్తి దీర్చి సమ్మాన్యుడయ్యె!



## శ్రీమతి హరిప్రియ మోతీలాల్

(7036006019)

కం. హరి యవతారముగ వెలసి
హరి నామమునే స్మరించి యహరహముగ దా
హరి కీర్తనలను గూర్చుచు
హరి హృదయము నందు జేరె హాయిగ చివరన్.

కం. సప్తగిరి వాసుని కొలువ
సప్తగిరుల నన్నమయ్య చరియించుచు దా
సప్తగిరీశునికిక్కృతులు
సప్త స్వరములు విదుర్చె జానపదాలన్

కోకనద. జీవితమంతయు శ్రీహరికొసగన్
కోవెలయందున కూర్మిగ కొలిచెన్
భావనజేయుచు వ్రాసె పదములన్
పావనమయ్యెను భక్తికృతులుగన్

మానిని. కోనల మధ్యన కోవెల యందలి కొండల రాయుని భక్తిగ దా
మానసమందున నిత్యముకొల్చెను మాధవుడాయని మౌనముగా
మానక వ్రాసెను పద్యములెన్నియొ మాలిమితోడను మాలికగా
గానముజేసెను సర్వము నీవని కాన్కలు కోరక మోదముతో.




## జనార్ధనాచారి గుగ్గిళ్ళ

జగిత్యాల (8074171774)

 మ. అదిగోయల్లదిగో!మధూత్తపద నిత్యాలాప సంప్రీతుడై
పద సంకీర్తనదేలు గాయకుడు! దైవారాధనాసక్తుడై
పదముల్ గొల్చెడు నన్నమయ్య! ఘనుడౌ వాగ్గేయకారుండు! దా
బొదరించెన్, సుపదాలు వేలు హరికై! బోటెత్త భావాంబుధుల్!

ఉ. ఆతని జోలలందు,హరి హాయిగ నిద్రనుబోయె, మత్తుడై,
యాతని పాటలన్ని,హరి హాయిగ గ్రోలి,సుఖించె,ముగ్ధుడై
యాతని ప్రేమ భావనకు నచ్చెరువొందెను వేంకటేశుడే
యాతడె,యన్నమయ్య,పదయజ్ఞము జేసి,గడించె గీర్తులన్!

కం. వినుడిదె రఘుపతి లీలలు
వినరో భాగ్యము గలుగును, వినుమని పాడెన్!
తనవారను, పెరవారను,
మనుజుల మదిలో మెదిలెడు మాయను ద్రుంచెన్

సీ. చాలదా! హరినామ–సంకీర్తనా నాదు
జన్మకున్, జాలులే–చాలుననియె
చిత్తమ్ములో నిన్ను–స్థిరముగ నిల్పితిన్,
చేపట్టి మముగావు–శీఘ్రమనియె
సకలశాంతికరమ్ము! సర్వేశ నీపైన
భక్తి యుక్తులు,నోము–ఫలములనియె



శోభనమే చూడ–శోభనమ్మే హరి
సుందర రూపమ్ము–జూడుమనియె

తే.గీ. చేరి మ్రొక్కరో నరులార,–శ్రీశుననియె
తనివితీరంగ శ్రీహరిన్–దలచుమనియె
కట్టెదురను,వైకుంఠమ్ము–గనులజూపె
నన్నమయ్య,తా శ్రీహరి–యాత్మగాదె!




## శ్రీమతి లక్ష్మి రామచంద్రుని

మైనంపాడు. ప్రకాశం (9949796025)

1) సరసంపు కృతుల పల్కె సవ్యుడు మెచ్చన్
సిరినాథు రహిని తెల్పె సిద్ధగతిన్ జా
జర పాటల పదకేళి జానపదాలన్
తిరువీధుల వెలయించె తీర్థకరుండే!!
(పరమేశ వృత్తం..స,న,జ,భ,గగ..యతి..10)

ఆ.వె. విష్ణు ఖడ్గ మాయె విశ్వ కీర్తి గరపి
జానపద కవితల జావళీలు
వేనవేల కృతులు వెలయించె నన్నమా
చార్యుడై ప్రజలను జాగరూకులజేసె!!

తే.గీ. తాళ్ళపాక నందవరీకి తల్లి చెంత
చేరి గాన విద్య గరిపి జిలుగిడు పద
కవితలల్లి హరి స్తుతి గాన పూజ
జేసి సంసిద్ధి పొంది జేజేల నొందె!!

తే.గీ. అన్నమయ్య కీర్తించెడి నాదిదేవు
సకల జీవుల బ్రోచెడి సత్స్వరూప
వేగ రావదె మము బ్రోవ వేద వేద్య
నిన్ను పూజింతు మెన్నడున్ నిష్ఠ తోడ!



## శ్రీమతి సంధ్య గోళ్ళముడి

హైదరాబాద్ (9949219026)

ఆ.వె. అచ్చతెలుగు పదమె యన్నమయ్య పలుకు
ఆట పాటలకవి యాట పట్టు
అమృతపు గుళికలవి యందరి నోటను
దేవదేవు జేరు త్రోవ జూపు.

ఆ.వె. తత్త్వమంత బలికె తంబుర మీటుచున్
"కులము లేదు చూడ కలసి నడువు
ఎంత బ్రతికెనేని యేనుగుపై రాజు
కడకు మట్టియందె కలయుననెను!"

ఆ.వె. తలపు వలపు కలసి తలపోత జీవిక
బ్రతుకునడుప మనకు భారమేల?
సామి సన్నిధందు సాగింపుమా యాత్ర!
అనుచు జెప్పె మనకునన్నయయ్య.

ఆ.వె. పొంగు రాగమందు పొంగారు ప్రేమయు
రంగు రంగు పూలు రంగ రించి
తత్త్వ రీతి దెల్పె తాత్త్వికుడటగన
అన్నమయ్య గాద యన్ను మిన్ను.

ఉ. నాగరికుండు వాడని,ని నాదమె కాదదిమోదమేయగున్ !
సాగను పాదమే సరిగ 'సాపస'యంచును పాటలే వినన్!
చాగయె కీర్తనల్ పలుక సాహితి గానములాలపించగన్ !
సాగుగ సంగతుల్ 'పదప' సారస జావళి యాటపాటలన్!



## విద్వాన్ టేకుమళ్ళ వెంకటశేషయ్య

నెల్లూరు (944088355)

ఉ. పుట్టెను అన్నమయ్య పదపోషణ దెల్పగ తాళ్ళపాకలో
నెట్టొటొ సంచరించి తన నెమ్మది నిండిన తెట్టరాయనిన్
పట్టున జూడ నెక్కె గిరి పాదపు నడ్కను నేడు కొండలున్
పట్టుగ వచ్చినట్టి తన భక్తుని గాచెను వేంకటేశుడున్!

సీ. అన్నమాచార్యుని యన్నిపదమ్ముల
తెనుగు దనపు చవి తొణికిసాడె!
కొండల్లో నెలకొన్న కోనేటి రాయుని
కొండలంత మహిమ గూర్చి వెలిగె
మూసిన ముత్యాల మొరగులై మెరయుచు
యాసల చిత్తాన నాకళించె
పావనమ్ముల కెల్ల పావన మ్మొచును
జాను తెలుగు సుధ జాలువారె

తే.గీ. జ్ఞాన పథమును చేర్చెడి జానపదము
సర్వధారిన పుట్టియా సర్వధారి
వెన్నుని పదములె పదకవితలు కాగ
బాడె రాగములెన్నియో పరవశాన!



తే.గీ. అన్నమయ్య పదాలవి యాంధ్రమందు
జనుల మదిలోన తీర్థపు జలము లౌచు
పరమ భావన చేకూర్చె పరమపదము
నడుపు మార్గమ్ము లాయె నానందలీల!

తే.గీ. శ్రీనివాసుడ! విశ్వమే చింతమునిగె
రక్ష లేదు "కరోన"యె శిక్ష యాయె!
యన్నమయ్యను గాచిన కరముతోడ
సకల జనులకు సుఖములొసంగుమయ్య!




## డా.వేదాలగాయత్రీదేవి

ఉపమాక అగ్రహారం, విశాఖ (9885871464)

కం. శ్రీకరములు శుభకరములు
నాకరములునఖిలపాలనాకరములుగా
ప్రాకటకరుణావైభవ
శీకరములప్రోచుదేవ!శ్రీనాథ!నతుల్.

చం. పదములుపంచదారలయి ,పావనభక్తిపరంపరాకృతిన్
సదమలభావవీచికలసప్తగిరీంద్రు తలంచిపాడుచున్
నదములుపొంగిపొర్లునటునాట్యములాడగ సప్తశైలముల్
పదములువ్రాసిపాడిననపారుని నన్నమయాఖ్యుతల్చెదన్.

కం. హరిమననముతారకమని
హరియవతారమునిఖిలమునవనీస్థలిలో
హరియే యఖిలజగమ్మని
హరికీర్తనలాలపించె, నచ్యుతుకరుణన్.

ఇం.వ. శ్రీవేంకటేశస్థిరచిత్తమందున్
భావించినిత్యమ్మును ,పద్మనాభున్
దీవింపశ్రీశుండునుతేజమందెన్
భావింతుసత్కీర్తనభద్రమూర్తిన్.

శా. ఏపాదమ్ములు సృష్టిహేతువులొ అయ్యాపాదముల్ నమ్ముచున్
ఏపాదమ్ములు గంగకాకరము అయ్యాపాదముల్ కొల్చుచున్
ఏపాదమ్ములచెంతలచ్చి భువియున్, నీప్సన్ నతుల్సేయునో
ఆపాదమ్ములు నన్నమయ్య , ధనమౌ నాచంద్రతారార్కమున్.



## చి.ఆకెళ్ళ సాత్విక్

అమలాపురం.

1) చక్కెర చిలుకల మాదిరి.
చక్కని పదకవిత గూర్చి సంకీర్తనలన్
నిక్కపు భక్తిని ప్రజలకు.
దక్కించిన యన్నమయ్య ధన్యులు పృథివిన్

2) పదములు వేయవి చాలున.
పదకవితల నన్నమయ్య పరమాత్మునటుల్.
ముదమున సంకీర్తించిన.
విధమును కొనియాడ తరమ విబుధులకైనన్

3) అన్నమయ్య సుకీర్తనల్ విని యాత్మ నృత్యము సేయగా.
కన్నులందున భక్తి ధారలు కట్ట లై ప్రవహించునే.
జున్ను ముక్కల బోలు వాక్కులు సుందరాన్వయ భావముల్.
సన్నుతింపగ నాకు మాటలు చాలవే మహితాత్మునిన్

4) తెలుగుపలుకుబడి పదాల తీర్చినట్టి
అన్నమాచార్య భక్తికి నానవాల
టంచు భక్తులు కీర్తింతురయ్య నిన్ను
పదకవిత్వ పితామహా! ప్రణతి గొనుము





## లంక శివరామకృష్ణ శాస్త్రి

హైదరాబాద్.

1) అమ్మని పిల్చినన్ తుదకు నయ్యను గొల్చిన నున్న దొక్కటే
బొమ్మని తేటతెల్లమును పోడిమి నేర్పడ జేసి తీవు నా
కుమ్మరి బొమ్మలాట మన కొండలరాయుని యాట యొక్కటే
యిమ్మహి నేలుచుండె పరమేశ్వరు డంచును చెప్పితీవుగా.

2) ముప్పది రెండువేల ఘనపుష్పపు సౌరభమంద జేసి నా
యప్పుడు వేంకటేశ్వరుని నార్తిగ కీర్తన లందు గొల్చితీ
విప్పుడమిన్ననాదిగ మహేశ్వరుడై వెలుగొందు దేవుడే
చప్పున బ్రోచువాడనుచు చక్కగ నేర్పడ చెప్పినావుగా.

3) కమ్మని తేటతెల్గు నుడికారపు సొంపుల నేర్చి కూర్చి రా
రమ్మని పిల్చితీవు జనరంజకమైనవి నీదు  పాటలున్
ఇమ్మహి పూజలందుకొన నిల్చెను చెంగట వేంకటేశుడై
మమ్ముల బ్రోచుచుండె కడు మన్నన చూపెడు నన్నమయ్యరో!

4) పదకవితా పితామహుని పావన కీర్తన లన్నిపాడి నీ
పదములు చెంత వ్రాలెదము పాపవినాశన! పాహి పాహి మా
హృదయము నింద వీ కథలు తృష్ణను తీర్చవు భక్తి చేత మా
చదువులు సార్థకమ్మగును జన్మము ధన్యము వేంకటేశ్వరా!



## జొన్నలగడ్డ శ్రీనివాసరావు

తొత్తరమూడి

1) శ్రీనివాసుని మానసమ్మున బ్రీతిగా స్మరియించుచున్
వేనవేలుగ కీర్తనల్ బహుప్రీతిగొల్పగ ధారుణిన్
మానవాళికి కాన్కగానిడె మాన్యతన్ బడయంగదాన్
వానికీర్తిని జన్మజన్మల బ్రస్తుతింతురు మానవుల్

2) పరిణయమ్మున సుప్రభాతము పవ్వళింపులయందునన్
సరసమందు మహోత్సవమ్ములు సాగుచుండెడి వేళలన్
తిరుమలందున జేయుసేవల దివ్యమౌ పలుకీర్తనల్
స్వరముగూర్చిరి యన్నమార్యులు స్వామిభక్తిని చాటుచున్!

3) చందమామ రావె జాబిల్లి రాయంచు
దల్లులెల్ల తమదు పిల్లల గని
తెలుగునాట పాడు దివ్యమౌ కీర్తనన్
వ్రాసి యన్నమయ్య వాసికెక్కె!

4) పొడగంటిమయ్య యంచు గ
రుడాధిపతి బొగడుకొంచు లోకులు మెచ్చన్
బడయగ పుణ్యము నాతడు
నుడివెను పలు గేయములను నోముల ఫలమై!





5) అంతర్యామీ! యలసితి
జెంతకు జేకొమ్మటంచు జింతింపగ శ్రీ
కాంతుడు ప్రత్యక్షంబై
స్వాంతనమిడె వారికెల్ల సద్గతులిడి తాన్!

6) కలియుగమ్మున వేంకటేశునికంటె దైవము నొక్కరిన్
గలయ జూచిన నెందునైనను గానరాడని నమ్ముచున్
వెలయజేసిరి యన్నమార్యులు వేంకటాపతి కీర్తనల్
నిలిచియుండగ శాశ్వతమ్ముగ నిత్యపూజల యందునన్!

 

# గొర్తి బాల సుబ్రహ్మణ్యం

ఇందుపల్లి, అమలాపురం (9848411466)

1) శ్రీరమణీయ రూపమున చెన్నలరారెడు శ్రీనివాసునిన్
కారణ జన్మమంది ఘనకార్యము సల్పగ తేట తెల్గునన్
సారమతీవ శోభలను చక్కని గీతిక నాశుధారలన్
పారము గొల్చితీవు హరిభక్తి సుమమ్ముల త్రోవజూపి, నీ
వారస భక్తకోటులను వర్ధిల జేసితివన్నమయ్యవై !!

2) పదకవితలు ముదమందుచు
నెదలంతర్వర్తిగాంచి యీశ్వరు గొల్వన్
మొదలెడితివి కవితార్చన
సదయుడవై భక్తిమార్గ సాధన గూర్చన్ !!!

3) నిత్యసత్యమైన నిరుపమానమునైన
వేదవేద్యుని గొని వేలకొలది
పదము పదము పాడి భక్తితత్త్వము నింపి
మమ్ము గాచినావు మార్దవమున

4) పట్టువిడుపులందు పట్టవలసినది
పట్టుకొన్న వాడె పండితుడగు
శ్రీనివాస పదము చిరమును పట్టంగ
జనుల నడిపినట్టి ఘనుడవయ్య!!!

 

## దువ్వూరి వేంకట నరసింహ సుబ్బారావు

రాజమండ్రి (9701292739)

మ. అదివో అల్లదివో యటంచు తన నేత్రాబ్జంబులన్ గట్టి వై
చి దివారాత్రులు శ్రీనివాసమును సంసేవించుచున్ శ్రీహరిన్
మదిలో బాడుచు వేంకటాధిపుని ప్రేమన్ భక్తి నిర్వేదనన్
తుది దాక న్మన అన్నమయ్య చనె నస్తోకంపు గైవల్యమున్.

మ. ఒకచో నార్తిని వేడు వేరొకెడ తా నూగు న్మహోన్మాదియై
ఒకచోటం గని ముద్దు సేయు హరి నోహో బిడ్డడా యంచు నిం
కొకచో నాట్యము సేయు ప్రేమికగ తన్నూహించుచున్ భర్తగా
నిక సర్వస్వము నీవ యంచు మిగులు న్నిర్వేదియై యొక్కెడన్.

ఉ. అచ్చ తెనుంగు భాష కొక అద్దము సూడగ అన్నమయ్య తా
మెచ్చి రచించినట్టి పలు మేల్మిపదాల్ మరి యంతె కాదు సూ
నచ్చిన సంస్కృతంబునను నాణ్యత పొంగులు వార నెన్నియో
వచ్చె పదాలు వాక్కునను వాహినులై మన అన్నమయ్యకున్.

చం. పదకవితా పితామహుడు భవ్యపదమ్ముల వేంకటాధిపున్
హృదయపు లోతులందు జనియించిన భక్తిని జేసె సన్నుతిన్
పదముల బట్ట జాలు మన స్వామిని బుట్టుట సున్న మోక్ష స
త్పద మది చేతి కందు నని పాడెను వేడెను బొందె ముక్తినిన్.



## ఆకెళ్ళ సుమేధ

అమలాపురం (9017415138)

కం. పులకించెను పరమాత్మయు.
నలరింపగ నన్నమయ్య యమృతార్ద్రకృతుల్
కలకాలము జీవించెడు
నిలలో సద్భక్త జనుల హృదయాబ్జములన్

మ.కో. శేషశాయి వినమ్రభక్తుడు క్షిప్రమై పద గీతికిన్.
భాష కీర్తి ని నాల్గు దిక్కులపంచె కీర్తన సేసి యా
యౌషధంబుల రీతి నుండెడి నద్భుతంబగు గానముల్
భూషణంబులు భక్తవర్యుల ముక్తి మార్గము చూపెడిన్

ఆ.వె. తల్లి లాలి పాట తనది కాదా యేమి
భక్తి సుధ లు చిలుక పదము లందు
వేంకటేశుగొలిచి ప్రియమార కీర్తించి
యాంధ్ర జాతి కిచ్చె నమృత ఝరులు

గీ. బ్రహ్మ మొక్కటే యనుచునుపరమతత్త్వ
బోధ జేసిన పూజ్యుండు ముక్తి మార్గ
దర్శి యన్నమాచార్యులు ధర్మ మూర్తి
పరమ భాగవతోత్తముడురుగుణనిధి





## ఆర్యసోమయాజుల సుబ్రహ్మణ్యసోమయాజులు

హైదరాబాద్, (9687084498)

ఉ. పాటలయందునే పదము పాడుచు కీర్తనలాలపించగా
మాటల మాటునే స్వరము మార్చగ గీతముచిందులేయగా
ఆటల యందునే హరిని యాడగ నోడగ జేసినంతనే
నాటక మంతయున్ ముగిసె నాహరి జేరగనన్నమయ్యయే!

కం. పద కవిత లల్లు చుండియు
బదముల హరి కీర్తనములు బాడుచు సతమున్
పదపల్లవముల విలసత్
పదమిడె నాయన్నమయ్య పద్యములందున్!

కం. అదివో అల్లదివోయని
మదిని హరిని దలచి యన్న మయ్య సతమ్మున్
బదముల పాటల నల్లగ
ముదమున హరి నందకునికి ముక్తి నొసంగెన్!

సీ. క్షీరాబ్ధి కన్యక శ్రీ మహా లక్ష్మి కి
నీరజాలయముననిడగహార
తులగొల్చి భక్తితో తులసీ దళమొసంగి
అన్నమయ తరించె నంతరంగ



మొందగ తన్మయము పరవశించుచు
　　నిత్యపూజలతోడ నిరతసేవ
లందించి కీర్తనలనుపాడిపదముల
　　రమ్యముగ హరిని రక్తిగలుగ!

తే.గీ.　కులుకక నడవరో కొమ్మ కోర్కె వినగ
కులుకు నడకల నరుదెంచి సిరులతల్లి
అన్నమయ్యచే సేవల నందుకొనుచు
సంతసమునొంది వరమిచ్చె స్వామిజేర!





## పందిరి కోటేశ్వరరావు

కోటిపల్లి (శ్రీకాకుళం) (9494587925)

మ.కో. శ్రీనివాసుని యంశ తోడను పృథ్వి లోనుదయించెనే
వేన వేలుగ పాటలల్లెను వేంకటేశుని జేరగన్
గానమంతయు బద్మనాభుని గారవించుట కోసమే
ఆనవాలుగ జూపినాడిల నన్నమయ్య భజించుచున్ !!

కం. హరివాసము చేరుటయే
సరియగునని యన్నమయ్య సతతము దెలిపెన్
విరివిగ తేట తెలుగులో
హరికీర్తనలను రచించె నాహరి కృపతో !!

తే.గీ. పదకవితకు నాద్యుడుగను బరిమళించి
పేరు పొందిన పాటలు పెక్కు వ్రాసి
హరిని గొల్చిన భక్తుడా యన్నమయ్య
భజన సాంప్రదాయమునకు బాటసారి

ఆ.వె. జోల పాట పాడి జో యచ్యుతానంద
యనుచు భక్తి తోడ నన్న మయ్య
పవ్వళింపు మనుచు పలు సేవ లెన్ని యో!
చేసియు దరియించి చేరె హరిని!!



## శ్రీమతి పి.వి.వి.యన్. రాజకుమారి

గుడివాడ (9010492494)

తే. పద్మనాభుని పదములు ప్రస్తుతించె
నందకాంశ సంభూ తుండు నందమగును
పదకవితలకాద్యుడయిన పావనుండు
శ్రీనివాసుని భక్తితో చేరె తుదకు

కం. కులమత భేదము లేదని
వెలివేతలు తగవని పరపీడను బాపెన్
తలపున తిరుమల నాథుని
పలుకే చాలని తెలిపెను భక్తిగ సతమున్

తే. ఏడుకొండలె మోక్ష మ్ము నిచ్చునంచు
తెలుగు జానపదమ్ముల తేట పరచె
విష్ణు తేజుండు వేంకట విభుని వేడె
తిరుమలేశుని భజియించె పరవశమున

మ.కో. తల్లి దండ్రుల నోము పంటగ తాళ్ళపాకను బుట్టినన్
వల్లె వేయుచు భక్తి తోడుగ భవ్య నామము పాడుచున్
బల్లెలందును బట్న మందును బంధుమిత్రుల వేడ్కతో
పల్లవించెను నన్నమయ్యకు పాటలెన్నియొ పాడగన్





**డా.వాస భూపాల్,** పోస్ట్ డాక్టోరల్ ఫెలో,
ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైదరాబాదు (9949037616)

ఆ.వె. నందకమ్ము భువిని నారాయణాంశలో
అవతరించె నన్నమయ్యగాను
మాట పాటలాయె మాధవు దివ్యాజ్ఞ
పరమ గానలహరి పరిఢవిల్లె!

తే.గీ. ఆది వాగ్గేయకారుండు నాంధ్రమందు
కీర్తనాగ్రగణ్యాఖ్యుండు కీరవాణి
రాగిరేకుల మీద తా రాగ మద్ది
శాశ్వతమ్మును నిచ్చిన శైలి ఘనము!

ఆ.వె. పుడమియందు కులపు పోట్లాట వలదని
చాటి చెప్పినట్టి సామ్యవాది
మధుర భక్తి తోడ మధుసూదను గొలిచె
వేల కీర్తనముల వేదరాశి

ఆ.వె. చందమామ రావె జాబిల్లి రమ్మంచు
పిలిచినట్టి వాడు పేర్మి తోడ
జోలపాట పాడి జోకొట్ట నంతట
మురిసి మురళినూదె మోహనుండు!

ఆ.వె. దండనాథుడంత దండింప యత్నించ
దడవనట్టి దాసు ధైర్య శాలి!
వెన్ను చూపకతడు వెన్నుని కీర్తించ
బంధనములు వీడె! భక్తి గెలిచె!



## తపస్వీ (పంతుల వేంకటేశ్వరరావు)

విజయవాడ (9908344249)

చం. పదకవితా పితామహుడు పండితుడద్భుత గాన కౌశలుం
డు ధనముకోరకెన్నడును లోకులముక్తికి గీర్తనల్ రచిం
చి దనుజవైరికంకితముజేసినభక్తుడు పుణ్యమూర్తియే
విధముగ జూడనన్నమయ పెన్నిధియయ్యెను గాయకాళికిన్

సీ. ఆతని పాటల న్హాయిని పొందుచు
పరవశ మొందని నరుడు గలడె?
ఆతని గీతమ్ము లాలపించనియొక్క
డైనసంగీత గాయకుడు గలడె?
ఆతని గీతమ్ము లభ్యసింపని యొక్క
వాగ్గేయకారుడు వసుధ గలడె?
అతనిపాటవినక యావేంకటేశ్వరు
డొక్క దినంబైన నుండగలడె?

తే.గీ. ఆతడే యన్నమయ్య మహాత్ముడతని
భక్తిగానమ్ము బ్రతుకయ్యె ప్రజలకెల్ల
వేళలాదర్శమైనిల్చు వేలకొలది
వందనమ్ములు వారికి న్నందజేతు

కం. తన సంకీర్తన లన్నియు
ధనమున కాశపడక తనదైవమునకు న
ర్పణజేసిన ఘనుడు సుగుణ
ధనుండు మనయన్నమయ్య దండములయ్యా!





## యామిని కొళ్ళూరు

దుబాయ్ (971-50-267-3033)

ఆ.వె. తెలుగు భాషయందు దీటైన మొనగాడు
గీతరాశి నల్లి కీర్తి బొందె!
జనుల నోట పాట జాల్వారు నటులను
పాదు లేసి నాడు పరమ భక్తి!

ఆ.వె. పద్య-గీత మందు పాండిత్య పటిమకు
అన్నమయ్య జ్ఞాన మధిక మనుచు
భావితరము లన్ని పలికెడి మాటలు
కలియుగమ్ము నిలుచు కమల నాభ!

ఆ.వె. రాగి రేకులందు రాగమ్ము వ్రాయించి
పదిల పరచి నట్టి పరమ యోగి
హనుమ, రామ, కృష్ణ లందరి యందును
వేంకటేశు గనిన విష్ణు భక్తి!

ఆ.వె. నంద కాంశ మందు నందవరీకుడై
జన్మ మెత్తి నట్టి స్మార్తు డతడు!
విష్ణు భక్తి మెచ్చి వైష్ణవు డయినట్టి
సామ్య వాద శీలి! సాధకుండు!



# కవిరాట్ మురళి

విజయవాడ (9494768639)

ఉ. శ్రీ నిలయాంతరంగము వశీకరధారణ భావమాలికో
ద్యానవిహార హేళుల సదా గొలువంగ మనోహరంబుగా
గాన వికాస గీతగతి ఘర్మ కళా గుణపీఠికాగ తం
దానల నాట్యమాయె తిరు దాంతుని లీలలు చాటిచెప్పగా!

గీ. వేల పాటలు పదియారువేల గోప
బాలికలయి పదార్వేల భావములయి
శ్రీశ గోవింద షోడశ సేవసేయ
చాలనక వెలసె నిల సంచారపదము!

సీ. ఒకపాట మురిపాల ఒద్దికై శ్రీలక్ష్మి- నికరాలయాంతర నిధిగమారె
ఒకపాట యలమేలు ఒడలంతవిరహమై- సగమద మదనిస సరసమాడె
ఒకపాట యలసాప్తి కోరునగావళి- మొగసాలగోవిందు మోడ్చి పాడె
ఒకపాట యలనింగి ఓజస్సు వేల్పులన్ - నిధియైన తెనుగుసన్నిధినినిలిపె
గీ. ఈవి తీర్చు నా యలమేలు నీశు పాద
ధారణై పద్మ నిధిగ నెత్తావియగుచు
ధీవిధాన మంత్రాంగమే దీప్తికాగ
భావి కన్నమయ్యొసగేను భక్తిబాట!

గీ. తల్లి యొడిని శిశువునుండి ధాతవరకు
కమ్ముకొన్నతెలుగుపాటకన్నమయ్య
ఇమ్మగు పదగాన ఝురుల ఇంపునద్ది
కమ్మనైన కీర్తనలిచ్చె కలిమి వోలె!





# శ్రీ తాళ్ళపాక అన్నమాచార్య అష్టోత్తర శతనామావళి - విజ్ఞప్తి

తాళ్ళపాక అన్నమాచార్యులు (మే 9,1408 – ఫిబ్రవరి 23,1503) సాహితీచరిత్రలో లభించిన ఆధారాల ప్రకారం తొలి తెలుగు వాగ్గేయకారుడు. అన్నమయ్యకు పదకవితా పితామహుడు, ద్రావిడాగమ సార్వభౌముడు అన్న బిరుదులున్నాయి. దక్షిణాపథంలో భజన సంప్రదాయానికి, పదకవితాశైలికి ఆద్యుడు. గొప్ప వైష్ణవ భక్తుడు. తిరుమల శ్రీ వేంకటేశ్వరస్వామిని, ఇతర వైష్ణవ సంప్రదాయ దేవతలను కీర్తిస్తూ 32వేలకు పైగా కీర్తనలు రచించి రాగి రేకుల మీద చెక్కించి పదిలపరచారు. కానీ రాగం విలువ తెలియని జాతి రాగికోసం వాటిని రగించుకోగా కేవలం 12 వేల సంకీర్తనలు మాత్రమే మనకు లభ్యమయ్యాయి. అన్నమయ్య కీర్తనలలో భక్తి, సాహిత్యం, సంగీతం, శృంగారం, భావలాలిత్యం పెనవేసికొని ఉంటాయి. సమకాలికుడు కర్నాటక సంగీత పితామహుడైన పురంధరదాసు అన్నమయ్యను సాక్షాత్తు శ్రీనివాసుని అవతారంగా ప్రశంసించాడు. శ్రీమహావిష్ణువు ఖడ్గమైన నందకం అంశతో అన్నమయ్య జన్మించాడని శ్రీవైష్ణవ సంప్రదాయంలో నమ్మకం ఉంది. ప్రధాన మందిరంలో ఘంట అవతారమని కూడా అంటారు. త్యాగయ్య, క్షేత్రయ్య, రామదాసు వంటి సంకీర్తనాచార్యులకు అన్నమయ్య మార్గదర్శకుడు. అన్నమయ్య మనుమడైన చినతిరుమలాచార్యులు సంకీర్తనల గొప్పదనాన్ని “శృతులై శాస్త్రములై పురాణకథలై సుజ్ఞానసారంబులై, యతిలోకాగమ వీథులై, వివిధమంత్రార్థంబులై, నీతులై, కృతులై, వేంకటశైలవల్లభ రతిక్రీడా రహస్యంబులై, నుతులై, తాళులపాకన్నయ వచోనూత్నక్రియల్ చెన్నగున్.” అని కీర్తించాడు.

నందకాంశమని కీర్తించబడుతున్న అన్నమయ్య దైవాంశ సంభూతుడనడంలో ఎట్టి సందేహంలేదు. దైవాంశ సంభూతులను కూడా దైవంగానే కొలిచే సాంప్రదాయం మనది. అన్నమయ్య కూడా ఆ కోవకు చెందినవారే! అన్నమయ్యకు నేడు శ్రీవేంకటేశ్వర



ఆలయాలలో ప్రత్యేకమైన మందిరాలు కట్టించి పూజా పునస్కారాలు నిర్వహించడమనే ఆచారం ప్రబలిన మాట వాస్తవం. అయితే ఆ పూజలు అష్టోత్తరం, ధూప దీప నైవేద్యాలతో జరిగితే సంగీతవిద్వాంసులకు, భక్తులకు నేత్రపర్వంగా ఉంటుందన్న ఉద్దేశంతో నా మదిలో చాలాకాలంగా ఉన్న "అన్నమాచార్య అష్టోత్తర శతనామావళి రచన" కార్యరూపం దాల్చింది. అవధాని, సంస్కృతాంధ్రాంగ్ల పండితులు శ్రీ చక్రాల లక్ష్మీకాంత రాజారావుగారు నా మీద దయతో దీనిని పరిశీలించి తగుమార్పులు సూచించినదులకు వారికి కృతజ్ఞతలు. అలాగే అన్నమయ్య కీర్తనలను గానంచేస్తూ, అపారభక్తి విశ్వాసాలు కలిగిన సంగీతజ్ఞులు, విద్యార్థులు, గాయకులు, వాగ్గేయకారులు ఈ అష్టోత్తరాన్ని ప్రతి శనివారం శ్రీవేంకటేశ్వరుని పూజలో భాగంగా చదవగలరని ఆశిస్తున్నాను.

ఇట్లు

అన్నమయ్య పాదాంఘ్రి రేణువు

**టేకుమళ్ళ వెంకటప్పయ్య**



## అన్నమాచార్య అష్టోత్తర శతనామావళి

1. ఓం శ్రీ అన్నమాచార్యస్వామినే నమః
2. ఓం నందకాంశ సంభూతాయ నమః
3. ఓం విశాఖానక్షత్ర సంభూతాయ నమః
4. ఓం నాదోపాసనా తత్పరాయణాయ నమః
5. ఓం ద్రావిడాగమ సార్వభౌమాయ నమః
6. ఓం పదకవితా పితామహాయ నమః
7. ఓం శృంగారకీర్తన రచనా దురంధరాయ నమః
8. ఓం ఆధ్యాత్మిక కీర్తన ప్రియాయ నమః
9. ఓం ప్రథమాంధ్ర వాగ్గేయకారాయ నమః
10. ఓం కీర్తన ప్రియాయ నమః
11. ఓం సంకీర్తన స్వరూపాయ నమః
12. ఓం సంగీత శాస్త్ర పరాయణాయ నమః
13. ఓం నాదానందాయ నమః
14. ఓం శ్రీవైష్ణవాగ్రగణ్యాయ నమః
15. ఓం ద్వాత్రింశత్ సహస్ర కీర్తనా శోభితాయ నమః
16. ఓం తాళ్ళపాకగ్రామ వాసినే నమః
17. ఓం విఠలయ్య ప్రపితామహాయ నమః
18. ఓం నారాయణయ్య పౌత్రాయ నమః
19. ఓం నారాయణసూరి పుత్రాయ నమః
20. ఓం లక్కమాంబా సుపుత్రాయ నమః
21. ఓం అక్కాంబా పతయే నమః
22. ఓం పెదతిరుమలాచార్య పిత్రే నమః



23. ఓం చినతిరుమలాచార్య పితామహాయ నమః
24. ఓం తిమ్మక్క పతయే నమః
25. ఓం శంఖ చక్ర ముద్రాంకితాయ నమః
26. ఓం ఆదివన్ శఠగోపయతి శిష్యవరాయ నమః
27. ఓం ఘనవిష్ణు శిష్యవరిష్ఠాయ నమః
28. ఓం శ్రీపురంధరదాస సమకాలీనాయనమః
29. ఓం నానావైష్ణవ క్షేత్ర సందర్శనాయ నమః
30. ఓం వేంకటేశ సేవాగ్రగణ్యాయ నమః
31. ఓం ఆచార్యాయ నమః
32. ఓం నారదప్రియాయ నమః
33. ఓం తుంబురుప్రియాయ నమః
34. ఓం తిరుమల నివాసాయ నమః
35. ఓం సర్వ వేద తత్త్వజ్ఞాయ నమః
36. ఓం సర్వ సమదర్శినే నమః
37. ఓం విద్యాతత్త్వజ్ఞాయ నమః
38. ఓం అకల్మషాయనమః
39. ఓం అనఘాయ నమః
40. ఓం అమృతాంశవే నమః
41. ఓం అవతారమూర్తయే నమః
42. ఓం ఆనందాయ నమః
43. ఓం కలుషవిదూరాయ నమః
44. ఓం కవయే నమః
45. ఓం గుణాతీతాయ నమః
46. ఓం ఘనాయ నమః



47. ఓం చారుహాసాయ నమః
48. ఓం జయినే నమః
49. ఓం జ్ఞానినే నమః
50. ఓం తామసాది గుణరహితాయ నమః
51. ఓం తీర్థాయ నమః
52. ఓం నందనందన ప్రియాయ నమః
53. ఓం నిత్యానందాయ నమః
54. ఓం నిస్స్వార్థ సేవకాయ నమః
55. ఓం నిర్మలాయ నమః
56. ఓం పండితాయ నమః
57. ఓం పరమ పావనాయ నమః
58. ఓంపావనానఘాయ నమః
59. ఓం పుణ్యశీలాయ నమః
60. ఓం పుణ్యాత్మనే నమః
61. ఓం పూర్ణపురుషాయ నమః
62. ఓం ప్రసన్నాత్మనే నమః
63. ఓం ప్రసన్నాయ నమః
64. ఓం ప్రాజ్ఞాయ నమః
65. ఓం ప్రేమమూర్తయే నమః
66. ఓం భక్తాగ్రగణ్యాయ నమః
67. ఓం భవ్యాయ నమః
68. ఓం మహనీయ గుణాత్మనే నమః
69. ఓం మహనీయాయ నమః
70. ఓం మాన్యాయ నమః
71. ఓం యోగపురుషాయ నమః



72. ఓం యోగిపుంగవే నమః
73. ఓం యోగీంద్రాయ నమః
74. ఓం యోగీశ్వరాయ నమః
75. ఓం రామకథాలోలాయ నమః
76. ఓం వందనీయాయ నమః
77. ఓం వరపుత్రాయ నమః
78. ఓం వాగీశాయ నమః
79. ఓం విద్యానిధయే నమః
80. ఓం విద్యాపతయే నమః
81. ఓం విద్యావేద్యాయ నమః
82. ఓం వివిధాగమ వేద్యాయ నమః
83. ఓం విశ్వరంజకాయనమః
84. ఓం విష్ణుప్రియాయ నమః
85. ఓం వైరాగ్య ప్రియాయ నమః
86. ఓం శాంతమూర్తయే నమః
87. ఓం శాంతస్వరూపాయ నమః
88. ఓం శాంతాత్మనే నమః
89. ఓం శాంతాయ నమః
90. ఓం శుద్ధాత్మనే నమః
91. ఓం శృంఖలాబంధ విముక్తజీవనాయ నమః
92. ఓం శ్రీకృష్ణ భక్తాయ నమః
93. ఓం శ్రీనివాస పరమభక్తాయ నమః
94. ఓం శ్రీనృసింహ భక్తాయ నమః
95. ఓం శ్రీరామ భక్తాయ నమః
96. ఓం శ్రీహనుమ భక్తాయ నమః





97. ఓం సర్వజ్ఞాయ నమః
98. ఓం సాధవే నమః
99. ఓం సారహృదయాయ నమః
100. ఓం సిద్ధసంకల్పాయ నమః
101. ఓం సుగుణచిత్తాయ నమః
102. ఓం సుశీలాయ నమః
103. ఓం సచ్చిదానంద రూపాయ నమః
104. ఓం సచ్చిదానంద స్వరూపాయ నమః
105. ఓం సత్పరాయణాయ నమః
106. ఓం సత్పురుషాయ నమః
107. ఓం సద్భావాయ నమః
108. ఓం సర్వమంగళకరాయ నమః



శ్రీమత్త్వదీయ చరితామృత మన్నయార్య
పీత్వాపినైవ సుహితా మనుజా భవేయుః
త్వం వేంకటాచలపతే రివ భక్తి సారం
శ్రీ తాళ్ళపాక గురుదేవ నమో నమస్తే ...నమో నమస్తే ...